# వైశ్యప్రబోధిని

తెలుగు మాస పత్రిక



శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరి దేవి



జూలై 1994

Fax : 011-575-1308 ; Telex : 031-77145 ALFA IN ; Grams : SOUTH GUEST

✆ : 5722210 (6 Lines), 5739508 & 5722213, 5726725, 5722437

# హొటల్ సదరన్

( సదరన్ ట్రావెల్స్ వారి అనుబంధ సంస్థ )

అధునాతన సౌకర్యములతో తెలుగు వారిచే ప్రప్రథమముగా నడపబడుచున్న భోజన ఫలహారశాల మరియు విశ్రాంతి గృహమైన **హొటల్ సదరన్** లో మీరు ఢిల్లీలో ఉన్నప్పుడు బసచేయవచ్చును.

90 Rooms With Attached Bath & Dormitary Halls For Groups, Colour T.V. & Lift, Fax, Telex, STD/ISD Phones.

**TARIFF :** Single Room Rs. 190, Double Room Rs. 290

**యాత్రలు :-** మా అనుబంధ సంస్థ - సదరన్ ట్రావెల్స్ - వారు స్వంత డీలక్స్ వీడియో బస్సులలో ఢిల్లీ నగరం, తాజ్‌మహల్, మధుర, బృందావన్, బదరీనాథ్, కేదార్‌నాథ్, హరిద్వార్, సిమ్లా, జైపూర్, అలహాబాద్, వారణాసి, గయ, అయోధ్య మొదలగు స్థలములకు నిర్ణీత సమయములలో ఢిల్లీనుండి యాత్రలు నడుపుచున్నారు.

Our Super Delux Video buses & tourist cars are available on Contract for Tourists. Our receipts are approved for LFC/ Running LTC Tours in collaboration with India Tourism Dev. Corporation. ( Govt. of India undertaking )

Air/Rail Reservations are also Undertaken

వివరములకు

## Hotel Southern/Southern Travels

ఢిల్లీ లోని తెలుగు వారి ఏకైక వాణిజ్య సంస్థ

**18/2, Arya Samaj Road, Karol Bagh,**
**NEW DELHI - 100 005.**

బ్రాంచీలు :

1. హొటల్ అయోధ్యా బిల్డింగ్, లక్డీకాపూల్, హైద్రాబాద్ - 500 004. (ఫోన్స్ : 223658, 227233)
2. హొటల్ హౌరాబిల్డింగ్, ( మద్రాసు సెంట్రల్ స్టేషనుకు ఎదురుగా ) మద్రాసు - 600 003. (ఫోన్స్ : 564864, 585253)
3. హొటల్ రాజ్‌కమల్ కాంప్లెక్స్, శివానంద్ స్టోర్స్ దగ్గర, కుమార్ పార్క్ ఈస్ట్, బెంగుళూరు - 1. (ఫోన్స్ : 267040, 262633)

# శ్రీమత్ పెద్ద అహోబిళ ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం

రిజిష్టర్డు నెం. 195/88

2-2-21, షావుకారుపేట, ఆళ్ళగడ్డ - 518 543 (కర్నూలు జిల్లా)

సంప్రదించ వలసిన అడ్రసు :

6-3-609/161, ఆనంద నగర్, ఖైరతాబాద్
హైద్రాబాదు - 500 004. ఫోన్ నెంబర్లు : 33795 , 224320

## నిత్యాన్నదాన పథకము

దక్షిణదేశ మందలి పవిత్ర పుణ్యక్షేత్రాలలో కర్నూలు జిల్లాలోని అహోబిళ క్షేత్రమూ ఒకటి. దిగువ అహోబిళము, ఎగువ అహోబిళము అని ఈ క్షేత్రము రెండు పుణ్యక్షేత్రాలుగా ఉండి, వరద, అభయ ముద్రలతో శ్రీ నరసింహస్వామి అర్ధాంగి శ్రీ లక్ష్మీదేవి సమేతంగా ఇక్కడ కొలువుదీరి భక్తులను అనుగ్రహిస్తున్నారు. ఉత్తర, దక్షిణ భారత రాష్ట్రాలనుండీ భక్తులు ఈ క్షేత్రానికి విశేషంగా వచ్చి స్వామి వారి దివ్యమంగళ విగ్రహాన్ని సందర్శిస్తుంటారు.

ఈ స్వామి వారిని తిలకించుటకు అరుదెంచే వైశ్య యాత్రీకులకు వసతి సౌకర్యాన్ని కలిగించుటకు గాను పెద్ద అహోబిళంలో నాలుగు అంతస్థుల భవనాన్ని మూడు సంవత్సరాల క్రితం నిర్మించినాము.

19-5-1989 నుండీ నిత్యాన్నదానం చేస్తున్నాము.

అన్నదాన పథకానికి రూ.1175/-లు విరాళంగా ఇచ్చినవారు శాశ్వత సభ్యులుగా ఉంటారు. ఆ మొత్తముపై వచ్చు వడ్డీతో, ఆ దాత పేరున సంవత్సరానికి ఒక్కరోజు శాశ్వతంగా వైశ్య యాత్రీకులకు భోజనం పెట్టడం జరుగుతుంది.

ఈ అన్నసత్రభవనాన్ని విస్తరిస్తున్నాం. అందుకు దాతల నుండీ విరాళాలు స్వీకరిస్తున్నాం. ఈ భవన నిర్మాణానికి గాను రు.2500/-లు లేక అంతకు పైబడి విరాళంగా ఇచ్చిన దాతల ఫోటోలు ఈ అన్నసత్ర భవనము లోపల ఉంచబడతాయి.

ఈ సత్రం భవన నిర్మాణానికి కానీ, నిత్యాన్నదాన పథకానికి కానీ విరాళం ఇవ్వదలచిన దాతలు నేరుగా పై పేర క్రాస్ చేసిన చెక్కు ద్వారా కానీ, క్రాస్ చేసిన డి.డి. ద్వారా కానీ పై సంప్రదించవలసిన అడ్రసుకు పంపి రసీదు పొందవలెను.

ఉదార హృదయముతో సహకరించ వలసిందిగా వైశ్య మహాశయులను కోరుచున్నాము.

ఇచ్చెనమెల్ల సుబ్బరాయుడు శ్రేష్ఠి — అధ్యక్షులు

మేడా నరసింహులు శ్రేష్ఠి — ప్రధాన కార్యదర్శి

V.P.- A5

# అఖిల భారత శ్రీశైల క్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం

హెడ్ ఆఫీసు : కంభం        స్థాపితం : 1961        బ్రాంచి ఆఫీసు : శ్రీ శైలం

✆ : 2262 ప్రకాశం జిల్లా.        ✆ : 3158 (S.T.D. 085195) కర్నూలు జిల్లా.

అతి పవిత్రమైన జోతిర్ లింగములలో రెండవది ఐన శ్రీశైల మహాక్షేత్రము పూర్వము దేవతల చేత, రాజుల చేత సేవింపబడిన విషయం పురాణముల ద్వారా వినుచున్నాము. ఐనను 1960 సం॥కు ముందు రవాణా సౌకర్యములు లేక గత వైభవము తగ్గినదనుటలో సందేహములేదు. ఒకవైపు రవాణా సౌకర్యములు మెరుగు అగుట, మరియొకవైపు అత్యంత శక్తివంతమైన కావర్ డ్యామ్, ప్రక్కనేనున్న పవిత్రమైన కృష్ణానదిపైన నిర్మింపబడుచున్నందున యాత్రికుల రాకపోకలు అధికమైనవి.

1961 సం॥కి ముందే కేవలం మహాశివరాత్రి పర్వదినములలో వైశ్య యాత్రికులకు భోజన వసతులు కల్పించుచున్నా, మన కంభం వైశ్య సోదరులు నిత్యం వచ్చి పోవు యాత్రికుల యిబ్బందులు గమనించి ఎలాగైనా వైశ్య నిత్య అన్నదానము జరుప వలయుననే సంకల్పములో 1961న శ్రీ భ్రమరాంబా మల్లికార్జునుల వారి అనుగ్రహంతో కంభం వైశ్య సోదరులు ఒక సంఘముగా ఏర్పడి బాడి రిజిష్టరు చేయించి నిత్య అన్నదానం జరుపుచుండిరి. 1963లో దేవాదాయ శాఖ కేటాయించిన స్థలమున పూజ్యశ్రీ సత్యసాయిబాబా గారి సువర్ణ హస్తములతో 5.12.63వ తేదీన శంకుస్థాపన గావింపబడినది. అట్టి ఈ అఖిలభారత శ్రీశైలక్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం, శ్రీశైలం. దినదినాభివృద్ధి చెందుచూ ప్రస్తుతం అన్ని సౌకర్యములు గలిగిన 109 గదులు, భోజనశాల, ప్రార్థనామందిరం, కల్యాణ మండపం, సమావేశ భవనము, గోసంరక్షణశాల, 24 గంటలు నీటి వసతి కలిగి పలు ప్రాంతముల నుండి వచ్చు యాత్రికుల మన్ననలనుబడయుచున్నది. నిత్యం రెండు పూటలు అన్నదానం జరుపుచూ, మహాశివరాత్రి పర్వదినముననూ, ప్రతి కార్తీక మాసము రెండవ సోమవారం నుండి మూడవ సోమవారం వరకు జరుగు వార్షిక శంకర శివనామ సప్తాహము సందర్భముననూ వచ్చు వేలాది వైశ్య యాత్రికులకు ఉచిత భోజన వసతి సౌకర్యములు కల్పించుచు వినోద కార్యక్రమములు నిర్వర్తించుచున్నాము. ఈ క్రింద తెలిపిన పద్ధతుల మేరకు పై మన సత్రమునకు పైకం చెల్లించిన దాతలందరు ప్రశంసనీయులు.

<u>అక్షయ మహారాజ పోషకులు :</u> ఈ సత్ర సంఘమునకు రు.11,500-00లు సమర్పించిన దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణించబడుదురు. అట్టి పైకమును షెడ్యూల్ బ్యాంక్‌లలో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేయబడి అందుపై వచ్చు వడ్డీతో ప్రతి సంవత్సరము దాతకోరిన పేరుతో ఒక మహారాజ పోషక సభ్యత్వం పొందగలరు. అట్టి సభ్యత్వం పొందు దాతలు అక్షయ మహారాజ పోషకులుగా పరిగణింపబడుదురు. అక్షయ మహారాజ పోషకుల "18x15" అంగుళములు (ఫ్రేమ్‌తోసహా) గల దాత ఫోటో సత్రం ఆఫీసు నందు బిగించబడును.

రు.1160-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు మహారాజ పోషకులుగాను, సర్వసభ్య సమావేశమునకు సభ్యులుగాను ఉందురు. ప్రతి సంవత్సరము దాతకోరిన రోజున వారి పేర సత్రములో యాత్రికులైన వైశ్య సోదరులకు సంతర్పణ జరుపబడును. ఆ రోజు రాత్రి దాతపేర సాధువులకు అన్నదానము చేయబడును. "12x10" సైజులో దాత ఫోటో సత్రావరణములో పెట్టబడును.

రు.116-00లు ఇచ్చిన దాతలు ఈ సత్రమునకు జీవిత సభ్యులుగా ఉంటారు. ప్రతి కార్తీక శుద్ధ పాడ్యమి రోజున వీరందరి తరఫున శ్రీ భ్రమరాంబా సహిత మల్లేశ్వర స్వామి వారికి కళ్యాణము జరిపించి, పూజా ప్రసాదాలు, సత్రము యొక్క జమ, ఖర్చులతో పోష్టు ద్వారా దాతలకు పంపబడుతాయి.

యన్.బి. : ప్రతియొక్క స్తోమత కలిగిన వైశ్య సోదరులు ఏదో ఒక పద్ధతిన సహకరించి సత్రాభివృద్ధికి తోడ్పడగలరని ఆశించు చున్నాము.

ఇట్లు

పాలకవర్గం

అఖిలభారత శ్రీశైలక్షేత్ర ఆర్యవైశ్య నిత్య అన్నపూర్ణ సత్రం

వైశ్య ప్రబోధిని
( మాసపత్రిక )
స్థాపితము
1969



సంపుటి
25



సంచిక
11



జూలై -1994



సంపాదకులు :
'సంఘోద్ధారక',
'వైశ్యభూషణ'
పి.లక్ష్మీకాంతంశ్రేష్ఠి



ప్రాప్తిస్థానం
ఫోన్ : 45025
వైశ్య ప్రబోధినీ
కార్యాలయం
"వాసవీ భవన్ "
జయనగర్ కాలని,
విద్యామందిర్
తూ॥ భాగం
కడప - 516 002.

సంపాదకీయం

# చేతులు కాలిన తరువాత ...

ప్రపంచములో మాతృస్వామ్య వ్యవస్థ అత్యంత ప్రాచీనమైంది.

మాతృదేవతారాధన ఈ వ్యవస్థలోనే ఆరంభమైంది.

పితృస్వామ్య వ్యవస్థ ఆ తరువాతది.

మాతృదేవతారాధన - అంటే భగవంతుని స్త్రీ మూర్తిగా భావించి ఆరాధించడము. శ్రీ సూక్తము ఇందుకు ఉదాహరణము.

అట్టి స్త్రీ మూర్తినే మన మహర్షులూ-పెద్దలూ "ఆదిశక్తి" అన్నారు.

దుర్గ, భద్రకాళి, విజయ, వైష్ణవి, కుముద, చంద్రిక, కృష్ణ, మాధవి, కన్య, మాయ, నారాయణి, ఈశాని, శారద, అంబిక అని ఆ ఆదిశక్తికి పద్నాలుగు పేర్లు.

'కన్య' అనునది అందులో తొమ్మిదవది. ఆ కన్యక అను పదానికే పరమేశ్వరీదేవి అని మరో పదాన్ని చేర్చి కన్యకాపరమేశ్వరిగా అనాదినుండీ వైశ్యులు ఆరాధిస్తున్నారు.

అపురూపమైన అహింసాతత్వాన్ని ప్రపంచాని కందించేందుకు ఆ కన్యకయే వాసవిగా తెలుగు గడ్డపై - తెలుగు రాజైన కుసుమార్య ప్రభువుకు జన్మించింది.

ప్రపంచములో ప్రథమ సత్యాగ్రహి 'వాసవి' ఆర్యవైశ్యుల ఆరాధ్య దైవము.

పారమార్థిక దృష్టితో చూడవలసిన అంశము ఇప్పుడు లౌకికదృష్టితో చూడవలసి వచ్చింది.

ఆర్యవైశ్యులకు మూలస్థానంగా, శ్రీ వాసవీ దేవి

జన్మస్థానంగా ఉన్న పెనుగొండలోని శ్రీ వాసవీ దేవి ఆలయము ఇప్పుడు సమస్యల్లో పడింది.

ఆ ఆలయాన్ని కాపాడుకొనేందుకు ఎంతటి త్యాగాలకైనా సిద్ధపడాల్సిన అవసరమూ, ఆవశ్యకతా ఇప్పటి ఆర్యవైశ్యులకు తప్పనిదైంది.

శ్రీ వాసవీ దేవి విషయములో ఇంత వరకూ వైశ్య సోదరులు అనుసరించిన బాధ్యతా రహిత వైఖరే ఇందుకు ప్రధాన కారణము.

ఈ బాధ్యతా రహిత వైఖరి ఇప్పటికీ కొనసాగడము మరీ విచారకరము.

"కులానికి కానీ, వాసవీ దేవికి గానీ సంబంధించి చేసే ఆలోచనగానీ, ప్రయత్నం గానీ కనీసం పాతిక సంవత్సరాలకు ఆవలి పరిస్థితిని దృష్టిలో పెట్టుకొని చేయాల్సినట్టిది – అన్న పూజ్యులు, అనుభవజ్ఞులు, మంత్రివర్యులు శ్రీ రోశయ్య గారు చేసిన హెచ్చరికను గూడ గుర్తించలేని దురదృష్ట స్థితిలోనే ఈ పరిస్థితి ఇప్పటికీ ఉంది.

ధనబలం కలవాళ్ళూ, ఇదే అదనుగా భావించి ఏదో వ్రాశామనిపించు కొని, ఏదో వస్తుంది కదా అని ఆలోచించే వాళ్ళూ మాత్రమే పరిష్కరించాల్సింది కాదు ఈ సమస్య.

పీఠాధిపతుల, మఠాధిపతుల ఆలోచనలకు అందేదికాదు ఈ సమస్య.

కీర్తిశేషులు భగవంతంగుప్త, ఉప్పుటూరి వెంకట పున్నారావు, పండిత శ్రీ జమిళి నమ్మాళ్వార్, దోమా వెంకటస్వామి గుప్త మొదలగు వారలు ఈ వరకే ఈ విషయములో కావలసినంత కృషి చేసి తమ కృషిని గ్రంథస్థం చేశారు. వీరంతా పూర్ణప్రజ్ఞులు. అయినా వీరి కృషినీ, ఆలోచననూ, భావనలనూ అసమగ్రమనీ, తాము మాత్రమే సమగ్రతను సాధిస్తామనీ తమకున్న ధన బలంతో వ్యవహరిస్తూ సరిక్రొత్త సమస్యకు శ్రీకారం చుట్టున్నారు. ఎత్తైన ఆసనాల మీద కూర్చొని తమ గొప్పను మరీ మరీ చాటు కొంటున్నారు.

శ్రీ వాసవీ విషయాన్నే తీసుకొని తమ ఇష్టానుసారంగా పుస్తకాలు వ్రాసి, వైశ్యులనుండీ సంభావనలు పుచ్చుకొన్న కొందరి పూర్వులలాగే ఇదే విషయం ఆధారంగా కార్యక్రమాన్ని తీసుకొని, తాము మాత్రమే, ఉన్నతాసనాల మీద కూర్చొనగల వారమనీ భావిస్తున్నారు.

ప్రమాదం అంచులదాటుచున్నా మారని కొందరి వైఖరీ, మా కెందుకులే అని చూస్తున్న ఈనాటి వైశ్య సోదరుల స్థితీ ఇలాగే సాగితే చివరకు మిగిలేది చేతులు కాలిన తర్వాత ఆకులు కాల్చుకోవడం అవుతుంది.

# శ్రీ వాసవీ ప్రామాణిక ప్రతి నిర్ణయము – శ్రీ వాసవీ సుప్రభాతం కేసెట్ చేయుంచుట

1981లో ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ శ్రీ వాసవీ బింబ, మంత్ర, యంత్ర ఆరాధనా క్రమాలను నిర్ణయించి, చిరకాలంగా ఉన్న ఒక ప్రధాన సమస్యను పరిష్కరించింది. అయితే, శ్రీ వాసవీ దేవి ఇతివృత్తానికి సంబంధించిన "ఒక" ప్రామాణిక ప్రతి ఆవశ్యకతను అప్పుడు మహాసభ ఎందుకో విస్మరించింది. 1989లో శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్యవైశ్య ధర్మసంస్థల సమాఖ్య, ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. రాష్ట్రములోని శ్రీ వాసవీ కన్యకాపరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్యవైశ్య ధర్మసంస్థల స్వతంత్ర ప్రతిపత్తి పరిరక్షణ, వాటి ఉనికిని మరింత జాజ్వల్యమానం చేయుట అను అంశాలే ప్రధాన ఊపిరిగా, ముందుకు సాగిన ఈ సమాఖ్య, శ్రీ వాసవీ ప్రామాణిక ప్రతి ఆవశ్యకతను ఆనాడే గుర్తించింది. అయితే దాన్ని కార్యరూపంలో పెట్టుటలో కొంత జాప్యం జరిగింది. చివరకు ఈ ప్రామాణికప్రతి రూపకల్పనకు 21.6.1994వ తేదీన, ఈ సమాఖ్య రాష్ట్రములోని పలువురు పెద్దలు, విజ్ఞులతో ఒక సమావేశాన్ని విజయవాడ పట్టణము లోని శ్రీ కన్యకాపరమేశ్వరీ అన్నసత్ర ఉపరి భాగాన గల శ్రీ తెలప్రోలు బాపనయ్య సభా భవనములో ఏర్పాటు చేసింది. ఈ సమావేశములో ఈ సమాఖ్య కార్యవర్గ సభ్యులు కూడ అధిక సంఖ్యలో పాల్గొన్నారు. ఈ సమావేశములో అధిక శ్రద్ధతో పాల్గొన్న ప్రముఖ శ్రీ వాసవీ పురాణ పరిశీలకులు శ్రీ గట్టి సత్యనారాయణ గుప్త గారు ప్రామాణిక ప్రతిని సరిక్రొత్తగా వ్రాయించి, నిర్ణయించుటకన్నా 1951లో పెనుగొండ వారు ప్రకటించిన పురాణములోగల అభ్యంతరకరములు, అవమానకరములు, అనవసరములూ అయిన శ్లోకములను తీసి వేసి, శ్రీ వాసవి కన్యకా పరమేశ్వరీ దేవి పరాశక్తి పరిపూర్ణాంశమే అనుట మరింత రూఢిపడునట్లుగా, వేదవ్యాస ప్రణీతమే అనునట్లుగా ఒక ప్రతిని తయారు చేసి దాన్నే ప్రామాణిక ప్రతిగా ప్రకటించడము భావ్యంగా ఉంటుందని సూచించారు. ఆ సమావేశములో పాల్గొన్న వారందరూ అంగీకరించారు. ఆ విధముగు ప్రతిని తయారు చేయుటకు శ్రీయుతులు చిట్టిప్రోలు కృష్ణమూర్తి, గట్టి సత్యనారాయణ గుప్త, పి. లక్ష్మీకాంతం శ్రేష్ఠి, కొల్లిపర పాండురంగారావు గారలు ఒక ఉప సంఘంగా ఏర్పడి ఈ కార్య క్రమాన్ని వీలైనంత త్వరగా పూర్తి చేయాలని కూడ, ఆ తరువాత సమా వేశము తీర్మానించింది. ఈ పత్రికా

సంపాదకులు, ఈ సమాఖ్య ప్రధాన కార్యదర్శి శ్రీ పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి గారు ఈ ఉపసంఘానికి సంధానకర్తగా వ్యవహరించాలని కూడ ఆ సమావేశము నిర్ణయించింది. ఈసమాఖ్య అధ్యక్షులూ, "ప్రజాబంధు","దానశీల" శ్రీ కామిశెట్టి సుబ్బరావు గారు ఈసమావేశానికి అధ్యక్షత వహించారు.

22.6.1994వ తేదీన ఇదే సభా భవనములో, ఈ సమాఖ్య కార్యవర్గ సమావేశము జరిగింది. 21న జరిగిన ప్రామాణిక ప్రతి సమావేశ నిర్ణయాలను ప్రధాన కార్యదర్శి వివరించగా విని, సభ్యు లందరూ అందుకు ఏకగ్రీవ ఆమోదాన్ని తెలిపారు. గతములో, ఆంధ్రప్రదేశ్ ఆర్యవైశ్య మహాసభ అధికారిక సుప్రభాతంగా ప్రకటించిన స్వర్గీయ జమిలి నమ్మాళ్వార్ గారి శ్రీ కన్యకా సుప్రభాతమును మంచి గాయకులచే పాడించి, అవసరమైన సంగీతముతో టేపు (కేసెట్) గా తయారు చేయించాలనీ, శ్రీ పెనుగొండ క్షేత్రము లోని శ్రీ వాసవీ దేవ్యాలయానికి వైశ్యేతరులు కల్పిస్తున్న అడ్డంకులనూ, అవరోధాలను శక్తి వంతముగా ఎదుర్కొని శాశ్వత పరిష్కారమును సాధించుటకు న్యాయ సలహా విభాగమువారి అభిప్రాయాలను తీసుకొని ఆ మేరకు గట్టిగా కృషి చేయాలనీ, సికింద్రాబాద్ లోని శ్రీ వాసవీ దేవ్యాలయ నిర్వహణ మండలి సభ్యులలో ఏర్పడిన అభిప్రాయ భేదాలను పరిష్కరించుటకు ఈ సమాఖ్య అధ్యక్షులు శ్రీ కామిశెట్టి సుబ్బరావు, ఉపాధ్యక్షులు శ్రీ ఓరుగంటి బాలకృష్ణయ్య, ప్రధానకార్యదర్శి శ్రీ పి.లక్ష్మీకాంతం శ్రేష్ఠి గారలు ఒక ఉప సంఘముగా ఏర్పడి శీఘ్రముగా పరిష్కరించి వారిలో తిరిగి తొలుతటి సామనస్యాన్ని పునరుద్ధరించుటకు కృషి చేయాలనీ ఈ కార్యవర్గ సమావేశము తీర్మానించింది.

## రాజా మరణం తీరని నష్టం

– ఇల్లూరు శంకరయ్యగుప్త

వేదవిజ్ఞానధనుడైన శ్రీ పోలేపల్లి వెంగన్న (రాజా) శ్రేష్ఠిగారు జ్ఞాని. మేధావి. సాహిత్యప్రియుడు. ఆధ్యాత్మిక వేత్త. వైశ్యులను వేదవిహిత మార్గములో నడిపించుటకు వైదికకర్మాచరణశీలురుగ చేయుటకు వీరు చాలా శ్రమించారు. వైశ్యులు తమ సాంప్రదాయాల విషయంలో చేస్తున్న పొరపాట్లను ఎత్తి చూపి వారిని జాగృతులు చేశారు. అట్టి రాజా జగన్మాతలో లీనంకావడం వైశ్యులకు తీరనిలోటు. రాజాగారి ఆత్మకు శాంతిని ప్రసాదించమని జగజ్జనని శ్రీ వాసవీదేవిని కోరుతూ వీరి కుటుంబ సభ్యులకు నా సంతాపాన్ని ప్రకటిస్తున్నాను – అని శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్యవైశ్య ధర్మసంస్థల సమాఖ్య, ఆంధ్రప్రదేశ్, కార్యదర్శి, శ్రీ ఇల్లూరు శంకరయ్య గుప్త గారు రాజాగారి మరణవార్తను వింటూనే "రాజా" గారికి శ్రద్ధాంజలి ఘటించారు.

# సీతమ్మ ఆస్తుల పరిరక్షణకు రాష్ట్రస్థాయి సంఘం

స్వర్గీయ పంగులూరు కుప్పం సీతమ్మ గారు తిరుపతి పట్టణ వాస్తవ్యురాలు. స్వర్గీయ రామస్వామి శ్రేష్ఠి గారి సతీమణి. తిరుపతి పట్టణము కొత్తవీధిలో తనకుగల ఒక ఇంటిని, తిరుపతి పట్టణానికి చెందిన కొంట్రాజు పట్టెడలో తనకు గల కొన్ని ఎకరాల భూమి, మరియు నీటి పారుదల గల తోట, అందలి ఫలవృక్షాలు అన్నింటినీ కూడ, తన అనంతరము తన భర్త అనుభవించునట్లూ, భర్త అనంతరము పై ఇల్లు భూములు అన్నింటినీ కూడ తిరుపతి పట్టణములోని శ్రీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయానికి ఆయా కాలంలో ట్రస్టీలుగా నియమితులయ్యే వారు తమ ఆధీనములోనికి తీసుకొని, ఆయింటికీ, ఆ భూములకూ చెల్లించవలసిన సర్కారు పన్నులను చెల్లించి ఆ పై రెండు ఆస్తుల ద్వారా వచ్చే మిగిలిన ఆదాయమును ఆర్యవైశ్యుల అభివృద్ధికి, తిరుపతికి వచ్చు యాత్రీకుల వసతి మందిరముగా ఇంటిని ఉపయోగపరచుటకూ, పేద ఆర్యవైశ్య విద్యార్థులకు ఉపకార వేతనములు ఇచ్చుటకు వినియోగించవలయునని సీతమ్మ గారు ఒక వీలునామాను వ్రాశారు. ఆ వీలునామాను 5.4.1926వ తేదీన తిరుపతిలోని అప్పటి సబ్ రిజిస్ట్రారు వారు రిజిష్టరు కూడ చేశారు. ఆస్తుల విలువ ఇప్పుడు కోట్లలో ఉంటుందని అంచనా. అయితే, వీలునామా ప్రకారము ఆ భూములపై ఇప్పుడు ఆధిపత్యము కలిగిన తిరుపతి శ్రీ కన్యకా పరమేశ్వరీ దేవస్థాన పాలకవర్గము వారు సదరు భూములను అతి తక్కువ ధరకు అమ్మి దుర్వ్యయము చేయాలనీ, స్వార్థానికి ఉపయోగించు కోవాలనీ ప్రయత్నించి నట్లు భావించిన ఆవేదనపరులైన కొందరు వైశ్యసోదరులు ఆ అమ్మకమును రిజిష్టరు కాకుండా కోర్టు ద్వారా నిలుపుదల చేశారు. ఈ భూములను నామమాత్రపు ధరకు విక్రయించి అన్యాయముగా వ్యవహరించుటను గమనించిన రిటైర్డు డి.యస్.పి. శ్రీ ఆదినారాయణ శ్రేష్ఠి మొదలగు వారు కొందరు ఈ అన్యాయమును ఎదిరించి, ఆ ఆస్తులను సీతమ్మ గారి ఆశయాలకు అనుగుణంగా ఉపయోగించుటకు గాను 15.5.94వ తేదీన తిరుపతిలో "అంతర రాష్ట్ర ఆర్యవైశ్య సదస్సు" అను పేర ఒక సదస్సును ఏర్పాటు చేశారు. ఈ సదస్సులో ఆంధ్ర తమిళనాడు కర్నాటక రాష్ట్రాలకు చెందిన వైశ్య సోదరులు గణనీయ సంఖ్యలో పాల్గొని, జరిగిన విషయాలను, సర్వమూ విశదంగా చర్చించు కొని, ఈ సీతమ్మ ఆస్తుల పరిరక్షణకు వాటిని ఆమె ఆశలకు, ఆశయాలకూ అనుకూలంగా ఉపయోగించుకొనుటకు ఈ క్రింది వారితో ఒక రాష్ట్రస్థాయి సంఘమును "శ్రీ పంగులూరు సీతమ్మ ఛారిటీస్ డెవలప్‌మెంటు ట్రస్టు" గా

ఏర్పాటు చేస్తూ ఈ క్రింది వారిని తాత్కాలిక ట్రస్టీలుగా ఏర్పాటు చేస్తూ ఏకగ్రీవంగా తీర్మానించారు. అధ్యక్షులు శ్రీ సుంకు బలరాం, ఉపాధ్యక్షులు శ్రీ జి.నారాయణ రావు, శ్రీ పి.యల్.యన్. గుప్త, శ్రీ గుండయ్య శ్రేష్ఠి శ్రీ జి. సత్యనారాయణ, శ్రీ కె.సత్యం, శ్రీ యస్.పి. మునుస్వామి శ్రేష్ఠి, ప్రధాన కార్యదర్శి శ్రీ బి.ఆదినారాయణ శ్రేష్ఠి మొదలగువారు ఈ తాత్కాలిక ట్రస్టీలు తిరిగి అదే రోజు సమావేశమై శ్రీయుతులు శ్రీ జి.నారాయణ రావు, తమ్మన వెంకటరత్నం, గుండయ్య శ్రేష్ఠి, పి.యల్.యన్. గుప్త, డాక్టర్ సుంకు బలరాం, యస్.పి. రాధాకృష్ణ జి.సత్యనారాయణ గుప్త, కె.సత్యం, పి.యెరికలయ్య, బి.ఆదినారాయణ శ్రేష్ఠి కె.వి.బి.శంకరరావు, యస్.పి. మునుస్వామి శ్రేష్ఠిగారలను ట్రస్టీలుగా వ్యవహరించాలని తీర్మానించారు. శ్రీ బి.ఆదినారాయణ శ్రేష్ఠి గారికి ఈ విషయమైన యావత్తు విధులు నిర్వహించుటకు అధికారాన్ని కూడ ఇచ్చారు.

ఈ ఆస్తులను పరిరక్షించి, వీటిపై వచ్చే ఆదాయాన్ని భారత దేశములోని ఆర్యవైశ్యులెల్లరకూ ఉపయోగపడు రీతిలో ఈ క్రింది సేవా కార్యక్రమాలను చేపట్టాలి అనేది వీరందరి అభిప్రాయంగా తెలుస్తూ ఉంది. వైశ్య విద్యార్థినీ విద్యార్థులకు వసతి గృహము నిర్మించుట, శ్రీ వాసవీ విద్యాసంస్థలు స్థాపించుట, యాత్రికుల వసతి కొఱకు సత్రములు నిర్మించుట, నిత్యాన్నదానము చేయుట, కళ్యాణ మండపాల నిర్మించుట, వృద్ధవైశ్యులకు ఆశ్రమ నిర్మించుట మొదల కార్యక్రమాలు.

## గుడివాడ లైన్సు క్లబ్ అధ్యక్షులుగా శ్రీ గురుస్వామి

కృష్ణాజిల్లా గుడివాడ వైశ్య ప్రముఖు శ్రీ కారంశెట్టి గురుస్వామి గారు గుడివా లైన్సుక్లబ్ అధ్యక్షులుగా ఎన్నికయ్యారు ఈ సందర్భాన్ని పురస్కరించుకొని శ్రీ గురుస్వామి గారిని 17.6.94వ తేదీ పలువురు ప్రశంసించారు. ఈసందర్భంగా జరిగిన సభలో పలువురు వక్తలు పాల్గొ స్వామి గారి సామాజిక సేవనూ, వర్త ప్రతిభను ఉగ్గడించి సత్కరించారు. శ్రీ కారంశెట్టి కోటయ్య గారి కుమారులైన శ్రీ గురుస్వామి గారు గుడివాడ పట్టణములో పేరెన్నిక గన్న ప్రముఖ వ్యాపారులు. గుడివాడ డివిజన్ రైస్ మిల్లర్సు అసోసియేషన్‌కు ఉపాధ్యక్షులు. కె.టి.ఆర్. మహిళా కళాశాల పాలక వర్గ సభ్యులు. గుడివాడలోని శ్రీ ఆర్యవైశ్య కల్యాణమండప సంఘానికి స్థాపకసభ్యులు. మఱియు అనేక పదువులు నిర్వహిస్తూ సమాజసేవ చేస్తున్నారు.

# సూక్తి ముక్తావళి

గరుత్మంతుడు మహా బలవంతుడు. తన తల్లి కద్రువకు దాసియై యుండెను. కాద్రవేయులకు అమృతకలశము తెచ్చి యిచ్చి తల్లిని విడిపించుకొనవలసి వచ్చినది. స్వర్గలోకానికి వెళ్ళి అమృత రక్షకులను నిర్జించి అమృతకలశం తీసుక పోతున్నాడు. అప్పుడు దేవేంద్రుడు అడ్డుపడి, వజ్రాయుధం ప్రయోగించినాడు. కొండలను పిండిసేయగల ఆ వజ్రం గరుత్మంతుని తాకలేకపోయింది. గరుత్మంతుడు సత్పురుషుడు. వజ్రాయుధంతో యిట్లన్నాడు. ఓ వజ్రమా! నీవు మహాముని తనువున పుట్టిన దానవు. అంతే కాదు. త్రిలోకాధిపతియైన దేవేంద్రుని ఆయుధానివి. కనుక నిన్ను అవమానించరాదు. ఇదిగో. నా రెక్కలోని ఒక ఈకను కత్తరించి వెళ్ళిపో. నా ముందర నీ శక్తి యింతే. అన్నాడు. అంతకంటే వజ్రాయుధం ఏమీ చేయలేక పోయింది. ఇంద్రుడు ఆశ్చర్యపడి గరుత్మంతుని కొనియాడి అయ్యా! పక్షి రాజా! నీ పరాక్రమము ఎంతటిదో దయచేసి తెలియచెప్పుమని కోరినాడు.

దానికి సమాధానంగా గరుత్మంతుడు కం॥ పరనిందయు ఆత్మకుతోత్కార సంకీర్తనము చేయగా నుచితమె సత్పురుషులకు? అన్నాడు. సత్పురుషులు తమ గొప్పతనం గురించి చెప్పుకొనరు. అది తప్పు. అంతే కాదు. అది ఆత్మహత్యాసమం. మహాభారత కర్ణ పర్వంలో ఒక విశేషం జరిగింది. కర్ణుని చేతిలో చావుదెబ్బలు తిన్న ధర్మరాజు తన శిబిరంలో విశ్రమించి యున్నాడు. అన్నగారి క్షేమసమాచారం విచారించడానికి అర్జునుడు అక్కడికి వస్తాడు. అప్పటికి కర్ణ వధ జరుగలేదు. కర్ణుడు బ్రతికి ఉన్నాడని తెలిసి ధర్మరాజు అర్జునుని ఎత్తిపొడుస్తూ ఆక్రోశంతో అనగూడని మాటలంటాడు. అర్జునుడు ఓర్చుకోలేక పోయినాడు. కోపోద్రేకంతో నానా దుర్భాషలాడి చల్లబడతాడు. చల్లబడి నంతనే అయ్యో! అన్నను దూషించితినే! ఎంత పాపం చేసాను. అని కత్తి దూసి యీ పాపానికి ప్రాయశ్చిత్తంగా తన తల త్రుంచుకొంటానంటాడు. శ్రీ కృష్ణుడు ప్రక్కనే ఉన్నాడు. అర్జునా! ఆగు. కత్తితో తల నరుక్కొంటావా? అక్కర లేదు. ఆత్మ ప్రశంస చేసుకో సరిపోతుంది. ఎవడైనా తన్ను తాను పొగుడుకుంటే తన్నుతాను చంపుకొన్నట్లే అన్నాడు. అప్పుడు శ్రీకృష్ణుని ఉపదేశం ప్రకారం అర్జునుడు ఆత్మస్తుతి చేసుకున్నాడు. "హరుడు దక్క చాపధరుడు బరుడు ఎన నాకు త్రిభువనముల లేడు" అని అన్నాడు. అంటే పరమేశ్వరుడు ఒకడే నాకు సాటి అన్నమాట. ఇది ఆత్మస్తుతి ఇంతమాట అన్నాడు. కనుక అర్జునుడు ఇక హత్య చేసుకొన నక్కర లేదు.

వైశ్యప్రబోధిని, జూలై, 1994

రామాయణంలో ఆంజనేయుడు ఉన్నాడు. మహాబలసంపన్నుడని చెప్ప నక్కర లేదు. సముద్రం దాటి అశోక వనంలో సీతాదేవిని చూచి వనం విరచి నానా బీభత్సం చేసినాడు. రావణాసురుని చూడాలనుకున్నాడు. రక్కసులను పెక్కుమందిని చంపినాడు. ఇంద్రజిత్తుకు లోబడినట్లు నటిస్తూ బంధితుడై కొలువునకు వెళ్ళినాడు. ఎవడవురా నీవు అంటే శ్రీరామదూతను అన్నాడు. సత్పురుషులు తమ్ముతాము పొగడుకొనకూడదు. అయినా రామకార్యం సుగమం కావాలని చెపుతున్నాను. రావణా! నేను పరాక్రమిస్తే నా యెదుట ఎవడూ నిలువలేడు. నా వంటి వారు లెక్కలేనంతమంది శ్రీరామ చంద్రుని వద్ద ఉన్నారు అన్నాడు. హనుమంతుని వంటివాడు తన్ను గురించి తాను ఎంత చెప్పుకున్నా తక్కువే. కాని సత్పురుషుడు ఆత్మస్తుతి చేసుకోగూడదు. ఇది ఆత్మహత్యతో సమానమని హనుమంతునికి తెలుసు.

శ్రీ మద్రామాయణ కల్ప వృక్షంలో విశ్వనాథవారు ఈ మాటలు పలికించినారు.

"ఎవరికి వారుగా పొగడుట
ఇంతయు ఒప్పరు పెద్దలు
ఐన కార్య విధి ఒనర్పగా
వలసినప్పుడు చెప్పక తప్పదు."

అంతటి కార్య విధి అందరికి తటస్థించదు. కనుక ఆత్మస్తుతి తగదు.

(శ్రీ జాటూరు రమణయ్య గారి ఆకాశవాణి ప్రసంగాల నుండి)

## కడప జిల్లా వైశ్య విద్యార్థులకు శుభవార్త

కడప ప్రధాన కార్యస్థానంగా గల ఆర వైశ్య అఫిషియల్స్ అండ్ ప్రొఫెషనల్స్ అసోసియేషన్ వారు గత సంవత్సరము వలెనే ఈ సంవత్సరం కూడ 1994 ఏప్రెల్-మే నెలలో ప్రభుత్వము వారి నిర్వహించిన 7వ తరగతి, 10వ తరగతి ఇంటర్మీడియెట్, డిగ్రీ పరీక్షల్లో కూర్చొ ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులైన వైశ్య విద్యార్థి విద్యార్థులకు ప్రోత్సాహక బహుమతుల ఇవ్వదలచారు. అట్టి విద్యార్థుల ఫోటోస్టాట్ చేసిన తమ మార్కుల లిస్టుతో తమ దరఖాస్తును 10.8.1994 తేదీ లోగా శ్రీ కె.రామసుబ్బయ్య అధ్యక్షులు, ఆర్యవైశ్య అఫిషియల్స్ అండ్ ప్రొఫెషనల్స్ అసోసియేషన్ అప్సరా థియేటర్ వద్ద, కడప – 516 002.కు పంపవలసిందిగా సదరు అసోసి అధ్యక్షులు శ్రీ కె.రామసుబ్బయ్య గార తెలియ జేశారు.

## జమ్మలమడుగు రోటరీ క్లబ్బు అధ

కడప జిల్లా జమ్మలమడుగు పట్టణ ప్రముఖులు శ్రీ లింగాల రామయ్య గారు జమ్మలమడుగు రోటరీ క్లబ్బు ఆధ్యక్షులుగా 3.7.1994వ తేదీ ప్రమాణ స్వీకారం చేశారు.

# నేను, నాదేశం

( గత సంచిక తరువాయి )

పునర్వివాహం కొరకు నా వద్దకు వచ్చిన వితంతు బాలికలను చదివించుతూ వచ్చాము. భర్తచే విడిచిపెట్టబడిన వారిని కూడ చదివించాము. ఒక బాలిక అక్షరాభ్యాసం నుంచి యల్. యమ్. పి. చదివి డాక్టరు అయ్యే వరకు సహాయం పొందుతూనేవుంది. తలను బోడి చేయించుటకు ప్రయత్నాలు జరుగుచుండగా తప్పించుకొచ్చిన స్త్రీ విద్వాన్ అయి, హైస్కూలులో పండితురాలైనది. నైజాములో ఒక బీదతల్లి తన బాలవితంతు బిడ్డల నిద్దర్ని పరమత సంఘానికి యిచ్చివేస్తుండగా చూచి సహించలేక నా మిత్రుడు శ్రీ పోడూరి కనకరాజుగారు వారిద్దరిని నా వద్దకు పంపారు. ఒకామె గుంటూరులో ఉన్నవ లక్ష్మీనారాయణగారి సహాయంతో వృద్ధికి వచ్చి, టీచరుగా పనిచేయుచున్నది. రెండో బిడ్డ తన తల్లిని చూచుటకు నిజామాబాదుకు వెళ్ళి రౌడీలకు చిక్కింది. ఆమెను తప్పించేందుకు చేసిన ప్రయత్నాలన్నీ వృధా అయ్యాయి. మరెందరిని గురించైనా వ్రాయవచ్చు. ఇలాంటి సంఘసేవ చేయదలచిన వారికి ఎన్నో అవకాశాలున్నాయి. ఎందరో అనాధ స్త్రీలు సహాయం పొంది, తమ జీవితాలను సంస్కరించుకొనుటకు తయారుగా ఉంటారు.

సర్ ముత్తా వెంకటసుబ్బారావుగారి సతీమణి ఆండాళమ్మగారు తన సేవా సదనంలో యిలాంటి స్త్రీలను పోషించుటే గాక, మాతృప్రేమతో వారిని వృద్ధికి తెచ్చుచుండెను. కొందరిని సరయైన శిక్షణలో పెట్టుట చాలకష్టమయ్యేది. అలాంటి వారి తప్పులను పదేపదే క్షమిస్తూ ఎంతో ఓపిక, ప్రేమ చూపి అభివృద్ధికి తెచ్చారు. ముఖ్యంగా ఒక పిల్ల విషయంలో ఆమె దయార్ద్ర హృదయాన్ని కనిపెట్టి "ఏమమ్మా! యింత ఓపికతో పనిచేస్తున్నావు? నీ అభిప్రాయమేమి?" టని ప్రశ్నించాను. "స్త్రీలను ఒక వయసులో క్రమశిక్షణలో పెట్టగలిగితే వారి జీవితమంతా ఒక రాజబాటలాగా పోతుంది. తల్లిదండ్రుల అజ్ఞానంవల్లగాని, అజాగ్రత్త వల్లగాని ఒక స్త్రీ జీవితం పాడయితే, ఆమెను నిందించి ప్రయోజనమేమిటి? మనం కొంత ఓపిక చూపితే, బాగుపడుతుం" దని చెప్పినది. అలాగే జయించుతూ వచ్చింది.

## మాతో అన్యోన్య బాంధవ్యం

1930-31లో ఆరుగురికి పైగా అలాంటివారు మద్రాసు సేవాసదనంలో చదువుతున్నారు. వారు ఆదివారాలలో మా యింటికి వస్తూండే వారు. నా ప్రధమ

భార్యకు వారికి మధ్య చాలా అనురాగ మేర్పడింది. మా చిన్నయిల్లు నిండుగా వుండేది. నా భార్య హఠాత్తుగా చనిపోవుటతో ఆ పిల్లలు ఎంతో దుఃఖించారు. ఆ తరువాతకూడ మామూలుగా ఆదివారాల్లో వస్తూవుండేవారు. ఒక ఆదివారంనాడు అన్నపూర్ణమ్మ బట్టలు, పెట్టెలు వగైరా సామానులను నా అనుమతి లేకుండానే తమలో తాము పంపకం ప్రారంభించారు. నాకు నవ్వొచ్చింది. పంపకాలు కుదరక నన్ను తీర్మానించమన్నారు. రెండు ట్రంకు పెట్టెలలో ఒకటి పెద్దది; ఒకటి చిన్నది. ఎవరు దేనిని తీసుకోవాలి? ఇద్దరూ పెద్దదే కావాలని వాదించుకొన్నారు. సమాధానం కుదరక నన్ను తీర్మానించ మన్నారు. ఎవరికీ ఎలాంటి హక్కులు న్నాయో చెప్పమన్నాను. ఇద్దరిలో ఒకరు ముందుగా అన్నపూర్ణమ్మ వద్దకు చేరు కున్నందున ఆవిడే పెద్ద చెల్లెలు. పెద్ద భాగస్తురాలు; కాబట్టి, తనకు పెద్దపెట్టె నిమ్మన్నది. ఈ వాదన నాకు కూడా న్యాయంగానే తోచి, అలాగే తీర్పు యిచ్చాను. ఈ దిక్కులేని స్త్రీలు సంఘం వేలుపెట్టి చూపిస్తూ హింసించుతున్న స్త్రీలు ఎంత అన్యోన్యంగా మా కుటుంబంలో కలిసి మెలిసి వుండే వారో పై విషయాన్ని బట్టి తెలుసుకోవచ్చు.

శ్రీమతి రాజేశ్వరమ్మగారు జబ్బుపడి బెజవాడలో ఉద్యమాన్ని సాగించజాలక పోయింది. సంస్థ క్షీణించి పోయింది. అయితేనేం? ఈ విషయంలో ఆమెగారే మార్గదర్శిని.

## శ్రీమతి దరిశి సుభద్రమ్మ

ఈ ఉద్యమము మద్రాసులో సాగుటకు నా భార్య సుభద్రమ్మే కారణం. ఈమె యిలాంటి సంస్కరణలను మాకంటె ముందుగా ప్రారంభించి వ్యక్తిగతంగా నిర్వహిస్తూవచ్చారు. 1918 సం॥ నుండి మధ్యతరగతి స్త్రీల కష్టాలు తన కష్టాలుగా ఎంచి తానే భోజనం పెట్టి, బసయిచ్చి వృద్ధికి తెస్తుండెవారు. కొందరు టీచర్లు గాను, నర్సులుగాను వృద్ధికి వచ్చారు. ఏ అనాధ స్త్రీగాని తన కష్టాలను ఆమెతో చెప్పుకొని, సహాయం పొందకుండా వెళ్లలేదు.✦

✦ నే నీ ఘట్టాలు వ్రాస్తూవుండగా సుభద్రమ్మ ఒక స్త్రీకి ఉత్తరం వ్రాస్తున్నది. ఆ స్త్రీ తన భర్తను ఇద్దరు బిడ్డలను విడిచిపెట్టి, ఒకరితో వెళ్ళిపోయింది. భర్తకు ఆమె యందమిత ప్రేమ. తానామెను తిరిగి స్వీకరించాలనే ఉద్దేశ్యం. లేనిచో తాను, తన బిడ్డలేగాక, ఆమె మరీ అలాంటి ఘట్టాలు మామూలవడంవల్ల నాకిప్పుడు ఆశ్చర్యం కలిగించవు. స్త్రీలేకాదు, కుర్రవాళ్ళుకూడా వచ్చి "అమ్మా! ఎంతకాలమయింది మిమ్ము చూచి!" అంటూంటారు. వారు తమ పసితనంలో ఆమెవద్ద చదువుకుంటూ ఆమె ప్రేమకు పాత్రులైనవారే. ఇలాంటి ప్రేమ ఘట్టాలు, గాథలు ఈ ముసలితనంలో మాకెంతో ఆనందంగా వుంటున్నాయి. సంస్కరణల విషయంలో ఆమెయే ఒక పూర్తి సంస్థ అనవచ్చు. మద్రాసులో అనేక సంస్థలను, సంస్కరణాభిలాషులను ఆమె వినియోగ పెట్టుకోగలుగుచున్నది. ఆమెను గురించి నే నెక్కువగా వ్రాయడం బాగుండదు. నా భార్య కావడంచేత నేను అతిశయోక్తులు వ్రాశానని ఆమె నెరుగనివారు అనుకోవచ్చును.

పరుల సహాయం కావలసి వచ్చినప్పుడు తాను స్వయంగా పిల్లలను వెంటేసుకొని, తన పలుకుబడిని పూర్తిగా వినియోగించి సాధించుకొస్తుంది. ఆమె స్వయంగా ఇలాంటి పనులన్నిటిని నెరవేర్చగల సమర్ధురాలు. అందువల్ల నేను ఆ పనులు చూచుకోవాల్సిన అవసరం లేకపోయింది. ఇప్పటికీ అలాంటి స్త్రీలు వస్తూనే వుంటారు; వారి కష్టాలు గాధలతో సుభద్రమ్మగారి కండ్లు సాదారణంగా నీరు కార్చుతుంటాయి. వీధుల్లో, మీటింగులలో సినిమాలలో"అమ్మా" అని హటాత్తుగా వచ్చి ముట్టేస్తుంటారు. అధోగతి పాలవుతుందని ఆయన అభిప్రాయం. నా భార్య వద్దకు వచ్చి, తన భార్యకు సుభద్రమ్మగారిచే ఉత్తరం వ్రాయించుకున్నారు.

## రష్యాసాధన

సంఘంలో ఉండే కుళ్ళును శక్తికొలది తగ్గించటానికి మా శక్తికొలది ప్రయత్నించాము. ఇలాంటి వ్యక్తిగత ప్రయత్నాలు వేలవేలమంది చేసినా తరుగనన్ని లోట్లు మన సమాజంలో వున్నాయి. ప్రభుత్వం మాత్రమే సంస్కరణల మూలంగా సంఘంలోని లోటుపాటులను పూర్తిగా తొలగించగలదు. ప్రభుత్వవిధానం సంఘసంస్కరణలకు అనుకూలంగా ఉండనంత కాలము వ్యక్తులు సవరించగలిగినది సముద్రంలో నాక నీటి బొట్టు లాగానే ఉంటుంది. ఈ సత్యాన్ని స్వానుభవంద్వారానేగాక, సోవియట్ రష్యాను గురించి వెబ్ దంపతులు, డీన్ ఆఫ్ కాంటర్బరీ వంటి గొప్ప గ్రంథకర్తల రచనవల్ల ఈ మధ్య తెలుసుకోగలిగాను. నేటి రష్యాలో స్త్రీలకు ఘోషాలేదు. పడుపువృత్తిలేదు. బహు భార్యాత్వంలేదు; భర్త లేకుండా కలిగిన బిడ్డలకు న్యాయ చట్టాలవల్ల యిబ్బందులు లేవు అందరికీ చదువు, ఉద్యోగాలు ఉన్నై, పడుపు వృత్తిలో వున్నవారిని ప్రభుత్వమే సంస్కరించి, యితర వృత్తివిద్యలు నేర్పించి, ఉద్యోగాలిచ్చి వృద్ధికి తెచ్చారు. స్త్రీలు పురుషులతో సమానహక్కులు కలిగి సుఖించే అవకాశం సోవియట్ రష్యాలో మాత్రమే వున్నట్టు చదివి, తెలుసుకోవడమే నేను కమ్యూనిష్టుగా మారిపోవుటకు ముఖ్య కారణ మనుకుంటాను.

"స్త్రీల అభిమాని" అని కొందరు నన్ను నిందించారు. అవును నే నందుకు గర్వపడతానుకూడాను.

## తాలింఖానాలు

అమెరికావెళ్ళే స్టీమర్ల మీదను, జపానులోను జపనీయుల ధైర్యసాహసాలను, దేశభక్తిని చూచాను. బెంగాలులో టెర్రరిష్టుల తాలింఖానాలను గురించి లాహిరీ మొదలైన వారిద్వారా తెలుసుకొన్నాను. అటుతర్వాత దేశమంతటా తాలింఖానాలు స్థాపించాలని గొంతెమ్మ కోర్కెలు 1914-15లో కలిగాయి నాకు. అమెరికాలో వున్నప్పుడు (1931-15) వివిధ దేశాలలోవుండే తాలింఖానాలు, జిమ్నీజియములకు సంబంధించిన సంస్థలను గురించిన వివరాలను బాగా తెలుసుకున్నాను.

జపానులోని ఉద్యమం ఉత్తమమైనదిగా తోచింది. నేను రెండవసారి (1915లో) జపానుకు వెళ్ళినప్పుడు ఒక వారంరోజులు వారి తాలింఖానాలను పరిశీలించి, వారు దేశమంతటా ఎలా స్థాపించి, నిర్వహించు తున్నదీ-ముఖ్య వివరాలను; తెలుసు కున్నాను. 35 సం॥ల అనంతరం యిప్పుడు కూడా ఆపద్ధతి మన దేశానికి ఉపయోగపడునని నా నమ్మకము. జపాను లోని ఆ వుద్యమ స్వరూపం ఎలాగుంటుందో కొంత ఉదహరిస్తాను.

### జపానులో వ్యాయామము

జపాను వ్యాయామ ఉద్యమములో ప్రతిజపానీయుడు సభ్యుడుగా చేరవచ్చు. ప్రవేశరుసుము ఒక యెన్ (1-80 అప్పుడు) చెల్లించాలి. దేశభక్తివల్ల కోట్లరూపాయలు ప్రోగైనవి. సభ్యులు తమ జీవితంలో ఎప్పుడైనాసరే, ఆ సంస్థకు సంబంధించిన తాలింఖానాలలో రెండేళ్ళపాటు నేర్చుకోవచ్చును. నేర్చుకొనేటప్పుడు స్థానిక తాలింఖానాకు చందా యివ్వ పెద్ద నగరాలలో ఉదయం. గం. 5 మొదలు రాత్రి 10 వరకు తాలింఖానాలు తెరచివుంటాయి. మెంబర్లు అనుకూల సమయంలో వెళ్ళి నేర్చుకుంటారు. రోజుకు ఒక గంట మాత్రమే నేర్పుతారు.

ఆత్మరక్షణ విద్యలు-అనగా జిజిట్సు, బాక్సింగు, కుస్తీ, కత్తి సాములలో ఏ రెండిటినైనా నేర్చుకోవచ్చు తాలింఖానాలో ఆవిరిస్నానపు గదులు, వేడినీళ్ళగదులు, యీత కొట్టుటకు తటాకాలు వగైరా ఉండటమే గాక, తువ్వాళ్ళు సబ్బులు వగైరా సౌకర్యాలు కూడ ఉంటాయి. అవరణ పూలమొక్కలతో అందంగా ఉంటుంది.

స్థానికంగా మొదలుకొని కేంద్రం వరకూ జపాను దేశమంతటా పందాలు, పోటీలు ప్రతిసంవత్సరం నిర్ణీత సమయాల్లో జరుగుతూంటాయి. ఆఖరు పోటీలుమాత్రం పండుగరోజుల్లో జరుగు తుంటాయి. వీటివల్ల సంస్థకు చాలా ధనం చేకూరుతుంది.

ఆ పోటీలలో గెలిచినవారిని బోధకులుగా నియమించి, కేంద్రమే బాగా తరిఫీదు యిచ్చి, వివిధ ప్రదేశాలకు పంపుతుంది. ఈ విధంగా విదేశీయులందరికీ ఆటలయందు ఉత్సాహం కలిగేలాగు (Sports-Minded) చేస్తారు.

వ్యాయామ విద్యలను నేర్చుకొన్న వారికి ఆ విద్య తెలియని నలుగురైదుగురిని ఓడించగలమనే ధైర్యము, నమ్మకము కల్గుతాయి. జపాను తూర్పుదేశాల్లో ఒకటి. పశ్చిమ దేశాల వారు తూర్పు దేశాల వారిని చాలా చులకనగా చూస్తారు. సాధారణంగా నావికులు, సైనికులు చాలా పోగురు బోతుతనంగా ప్రవర్తించుతారు. అలాంటి వాళ్ళను పోలీసులు స్త్రీలుకూడా తమ జిజిట్సు తరిఫీదువల్ల ఒక్కొక్కరు యిద్దరు ముగ్గురిని గెంటివేస్తుంటారు. మన దేశానికి ముఖ్యంగా రేవుపట్టణాల్లో యిలాంటి తరిఫీదుచాలా అవసరం.

### "పోకిరీ పాశ్చా"కు దేహశుద్ధి

నేనీ ఉద్యమాన్ని మనదేశంలో

ప్రారంభించ లేకపోయాను. అయినప్పటికి పెద్ద ప్రయత్నం, ప్రయాస లేకుండానే నా సలహాలు విని కార్యరూపంలో పెట్టే వైశ్య సంఘంలో కొన్ని తాలింఖానాలను ఏర్పరచాను. ఈ విషయంలో ప్రొద్దుటూరు శ్రీ కొప్పరపు సుబ్బయ్యగారితో కలసి పని చేశాను. రాయలసీమలో ఎక్కువగా పని జరిగింది. ప్రొఫెసర్ బి.వి. నాధ్ అను నిపుణుని నియమించి, తాలింఖానాలను వృద్ధికి తెచ్చాము.

ఈ సందర్భంలో కావలిలో 1923 సం॥లో స్థాపించిన తాలింఖానా కథను వ్రాస్తాను. అప్పుడు నా చిన్న తమ్మునికి కావలిలో వివాహం జరిగింది. ఆ సందర్భంలో కావలివచ్చిన నా పెద్ద తమ్ముడు గురుస్వామి చెంబు తీసుకొని బహిర్భూమికి వెళ్ళాడు. అతను. కసరత్తుచేసి, హిందూముసల్మాను తగాదాలలో లాఠీలతో తీర్మానం చేసుకోవలెననే సిద్ధాంతంగల యువకులలో ఒకడు. చిన్న తనంలో లాఠీని తలక్రింద పెట్టు కొని నిద్రించేవాడు. అలాంటి వానిని బసకు తిరిగి వచ్చుచుండగా ఒక రౌడీ నిష్కారణంగా కొట్టాడు. గురుస్వామి తన చెంబు బదులు చెప్పాడు. కాని, రౌడీ కొట్టిన దెబ్బలతో చాల బాధపడుతున్నాడు. మా బంధువులందరూ ఈ విషయాన్ని నాకు మాత్రం తెలియకుండా, ఒక దినమంతా రహస్యంగా వుంచారు. మరునాడు నాకు కారణం తెలియగానే, ఆ రౌడీని శిక్షించాలని బయలుదేరాను. బంధువులందరూ ఆ రౌడీ జోలికి పోవద్దని నాకు అడ్డంవచ్చారు. కారణంకూడా చెప్పారు. ఆ రౌడీ పేరు "పోకిరి పాశ్చా" అట! వానిని చూస్తే కావలిలో అందరూ భయపడిపోతారట. పోలీసులు కూడ వాని జోలికి పోరట. స్త్రీలమీద రాళ్ళు వేస్తాడేమోనని "పెద్దమనుషులు" వాని జోలికి పోరు. ప్రతి అంగడికి నెలకు లంచం చందాగా తప్పకుండా సమర్పించుకొంటూంటారు. అలాంటి రాక్షసుడితో తగాదా పెట్టుకో కూడదని, నా శ్రేయస్సు కోరిన బంధువులు, స్నేహితులు సలహా యిచ్చారు. అలాంటి వాడినే శిక్షించి ఆ పట్టణ ప్రజల కష్టం తొలగించాలని నాకు ఉత్సాహం ఎక్కువైంది.

ఆ రోజుల్లో నేను బయటికి వెళ్ళేటప్పుడు నాచేతిలో మామూలుగా పేముబెత్తం ఉంటూండేది, "పోకిరిపాశ్చా" యింటికి వెళ్ళాను; ముసల్మాను లందరు నామీద పడతారని స్నేహితులు నాకు అడ్డంవచ్చారు. ముసల్మానులు అలా చెయ్యరనీ, మంచిపనులకు వారి సహాయం కూడ లభిస్తుందనీ నా నమ్మకం. తీరా వెళితేవాడు యింట్లో లేడు.

బజార్లో ఒక వంతెనమీద కూర్చుని ఉన్నట్టు తెలిసింది. అక్కడికి వెళ్ళాను. నా వెంట కొందరు మిత్రులు కూడ వున్నారు. వారిలో నాకు సహాయ పడగలిగినవారు ఒక్కరే- శ్రీ మిట్టదొడ్డి రాజానరసింగరావుగారు. ఆయన వస్తాదు; బలశాలి; "ఆ రౌడీ నా మీద పడితే ఏం చేస్తా" వని అడిగాను. "చితుకతన్నుతా" నన్నాడు. "నే నొక్కణ్నే వాడి పనిపడతాను మీరెవ్వరూ వాడిని కొట్టకూడదురాజా!

నువ్వు వాడి వెనుక నిలబడివుండు. వాడు నా మీదికి చెయ్యెత్తితే చేతులను వెనుకకు విరిచివెయి" అని ముందుగా సలహా యిచ్చాను. ఒక పని చేసే ముందుగా జయించుటకుగాను ఏదో వొక ప్లాను వేసుకోవడం నాకు అలవాటు.

పోకిరి పాశ్చా వంతెనమీద కూర్చొని వున్నాడు. వానితో మరి కొందరున్నారు. వాళ్ళువాడి ముఠావారై వుంటారని నాకు పిరికిమందు పొయ్యాలని నా వెంటవచ్చిన వారు అన్నారు. ఎంతమాత్రం వార్నింగు యివ్వకుండానే హఠాత్తుగా నా బెత్తంతో పాశ్చాను కొట్టసాగాను. రౌడీ బిత్తర పడి పోయాడు, "రాస్కెల్? పోలీస్ స్టేషన్‌కు నడువు" మన్నాను. చెయ్యెత్త లేకపోయ్యాడు. కండ్లలో భయము, కోపమూ తాండవ మాడుతున్నాయి. నా బెత్తం ఫెళ్ ఫెళ్‌మనివాగుతూనే వుంది. వాడి శిష్యులు మాయమై పోయారు. గుంపుకూడింది. గుంపులో నుండి ఎవరో "ఆయన దరిశి చెంచయ్యగారురా? చంపు తాడు. కాళ్ళుపట్టుకోరా!" అని ఉర్దూలో అన్నారు. నా కాళ్ళు పుట్టుకొన్నాడు. మరి వదలడే! బాగా భయపడిపోయాడు. చుట్టూ చేరి చూస్తున్న జనం ఆశ్చర్య చకితులయ్యారు. వారిలో చాలామంది నెలనెలకూ లంచమిచ్చి తన్నులు తప్పించుకొను మన్న పెద్దమనుష్యులు!

వారికొక ఉపన్యాసం యిచ్చాను. "ఒక తాలింఖానా పెట్టుకోండి. ఇలాంటి రౌడీలకు కావలిలో స్థానం లేకుండా చెయ్యండి" అని చెప్పాను. ప్రజలకు నా సలహా నచ్చింది. ముఖ్యంగా బాధపడుతున్నది వైశ్యులు. "కోమిటి పిరికి" అనే సామెత నిజంకాదని నిరూపించమని పౌరుషం వచ్చేట్లు మాట్లాడాను. అందరూ బాగున్నదని సమ్మతించారు. విరాళాలు యివ్వమన్నాను; వెంటనే యిచ్చారు. ఒకరు [పెండాల నారాయణ అని నాకు జ్ఞాపకం] ఖాళీస్థలం యిచ్చారు. నేర్పుటకు ఎవరినైనా నన్నే ఏర్పాటు చెయ్యమని కోరారు. తానే ఆరు నెలలకు అయ్యేఖర్చు అంతాకూడా భరించుతానని ముందుకు వచ్చారు. నా మిత్రుడు శ్రీ రాజా నరసింగరావుగారిని గురువుగా ఉండమని కోరాను; ఆయన తక్షణం ఒప్పుకొన్నారు.

మరునాడే తాలింఖానా ప్రారంభమయింది. పోకిరి పాశ్చా క్రితంనాడే మాయమైపోయాడు. వాడు మళ్ళీ కావలిలో కన్పించలేదు. యువకులు బాగా ఆరితేరారు. వైశ్యులచే స్థాపించబడిన తాలింఖానాలలో అన్ని కులాలవారు, మతాలవారు ముఖ్యంగా నాయుళ్ళు, ముసల్మానులు చేరుటకు అవకాశమిమ్మని ఎన్నాళ్ళో సలహాయిస్తూ వచ్చాను వైశ్యుల్లో వైశ్యులు పోటీలు పెట్టుకొన్నంత మాత్రాన ప్రయోజన ముండదనీ, ఇతరులతో పోటీ పెట్టుకోవలసిందని నే నిచ్చిన సలహా వారి బుర్రలోకి ఎక్కనేలేదు. రాజకీయాలతో సంబంధం లేకుండా కులాలు. మతాలవారీగా ఏర్పడిన యిలాంటి సంస్థలు చివరకు హిందూ ముసల్మాను తగాదాలకే ఉపయోగపడగా చూచి తలవంచుకొంటూండే వాడిని.

(ఇంకా ఉంది)

సం హా

రిజిష్టర్డు ఆఫీసు :– ఆత్మకూరు, కర్నూలు జిల్లా. ఫోన్: 4176

యూనిట్ ఆఫీసు :– 39-B, A.P.H.B. కాలనీ,
కడప. ఫోన్ : 44117

## నిరుద్యోగులకు శుభవార్త

పై సంస్థలో కడప, అనంతపురం, చిత్తూరు జిల్లాలో ఈ క్రింద కనబరచిన ఉద్యోగములు ఖాళీ ఉన్నవి.

1) ఏరియా మేనేజరు, అర్హత డిగ్రీ, జీతము నెలకు రు.5000/-
2) సెలక్షన్ ఆఫీసరు, అర్హత S.S.C., జీతము నెలకు రు.2500/-
3) సర్వీసింగ్ ఏజెంట్, అర్హత 7th Class, జీతము నెలకు రు.1000/-
4) క్యారియింగ్ ఏజెంట్, అర్హత 7th Class, జీతం నెలకు రు.1000/- సంవత్సరం వరకు తర్వాత నెలకు రు.1500/-

ఉద్యోగములో చేరగోరువారు ఈ క్రింద కనబరచిన అడ్రసులో యూనిట్ ఆఫీసర్ గారిని బయోడేటా, రెండు పాస్‌పోర్టు సైజు ఫోటోలు, విద్యార్హత తెలుపు సర్టిఫికెట్లతో సంప్రదించండి.

**గమనిక**

పీర్‌లెస్, ఎల్.ఐ.సి., రియల్ ఎస్టేట్స్‌లలో అనుభవం ఉన్న వారికి విద్యార్హతలు సడలించ బడును. మీ యింటి వద్దనే ఉండి ఉద్యోగ విధులను నిర్వర్తించ వచ్చును.

**A.N. సత్యనారాయణ**
ఎక్సైజ్ ఇన్‌స్పెక్టర్ (రిటైర్డు)
యూనిట్ ఆఫీసర్
సంక్షేమ జనరల్ ఫైనాన్స్
39-B, A.P.H.B. కాలనీ,
కడప – 516 004.
ఫోన్ : 44117

994 లై 2 నుండి 1994 ఆగస్టు 20 వరకు

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదివారము | | | 31 | | 1 |
| సోమవారము | | 25 | ఆ | 8 | 15 |
| మంగళవారము | | 26 | 2 | 9 | 6 |
| ధవారము | | 27 | 3 | 1 | 1 |
| గురువారము | 2 | 28 | | 11 | 8 |
| శు|కవారము | 2 | 29 | 5 | 2 | 19 |
| వారము | 23 | 30 | 6 | 3 | 0 |

లై 22 :– గురు (వ్యాస) పూర్ణిమ

పు 3 :– ఆశేష కారె రాక సా 5.

కూడిన సెలవు ము.

5 :– చెక్కు ద్వారా మ్మకం పన్నును చెల్లించు అసెసీలు చెక్కుతోబా 2 రిటర్నును అందుకు సంబంధించిన అమ్మకంపన్ను ఖాధికారికి చేర్చుటకు ఆఖరు తేదీ.

గస్టు 17 :– మఖ కార్తె రాక సా 4.07

గస్టు 19 :– వరలక్ష్మీ వ్రతం

గస్టు 20 :– A-2 రిటర్నును చలానాతో కు సంబంధించిన మ్మకం పన్ను ధికారికి చేర్చుటకు చివరి తేది.

మీ టేబులుపై ఉంచుకోండి. నెల అం మీకు కర్తవ్యాన్ని గుర్తు చేస్తుంటాను.

# శ్రీశైలక్షేత్ర నగర ఆల్ ఇండియా ఆర్యవైశ్య అన్నసత్ర సంఘం, శ్రీశైలము.

( రిజిష్టర్డు నెం. 25/1960 కర్నూల్ )


టెలిగ్రాం అన్ని చోట్లా " VASAVI "

టెలిఫోన్ నెంబరు : మార్కాపురం : 2595, శ్రీశైలం : 3140, 3114, పుట్టపర్తి : 2040, తిరుమల : అప్లైడ్.


## వైశ్యయాత్రీకులకు విజ్ఞప్తి

పై సంఘము ద్వారా నాలుగు క్షేత్రములలో సత్రములు కట్టించి అన్ని రకములైన వసతులు ఏర్పాటు చేసి, శాశ్వతముగా, ఉచిత వసతి, నిత్య భోజనములు ఏర్పాటు చేయులాగున తీర్మానించినాము.

1. <u>వాసవీ సత్రం, శ్రీశైలం</u> :– 128 టాయిలెట్ ఫర్నిచర్ కలిగిన రూములు, 4 పెద్ద హాల్సు, పూర్తిగా తయారుచేసి 25-12-62 నుండి నిత్యభోజనములు ఏర్పాటు చేసినాము. ప్రతి సం॥లో ఒక లక్షయాభై వేల మంది వైశ్యులు ఉచిత వసతి, భోజన సౌకర్యములు అనుభవించుచున్నారు. ఇందులకై విరాళములు రూ.1116.00 లు శాశ్వతసభ్యత్వం. ఇందుకు వచ్చు వడ్డీ మాత్రం అన్నదానమునకు ఖర్చు చేయబడును. దాత ఫోటో, పేరు వేయబడును. దాత కోరిన రోజు భోజన ఉభయం జరుపబడును.

   రెండవ అంతస్తులో 37 రూములు కట్టుచున్నాము. 30×10 రూము రూ.30,000/-, 15×7 రూముకు రూ.20,000/- అగును. రూము విరాళంయిస్తే దాతకు సం॥లో 30 రోజులు ఇవ్వబడును.

2. <u>వాసవీ నివాస్, పుట్టపర్తి</u> : 2 ఎకరంల స్థలములో నిర్మాణం చురుకుగా సాగుచున్నది. 75 రూములు తయారై యాత్రికులకు ఉచితంగా ఇచ్చుచున్నాము. సాధ్యమైనంత త్వరలో పూర్తిగా అన్ని వసతులతో నిర్మాణం చేసి, నిత్య భోజనములు ఏర్పాటు చేయుటకు ప్రయత్నములు త్వరలో జరుగుచున్నవి. స్థాపకులు శాశ్వత సభ్యత్వం రూ.2116.00 వారి పేరు, ఫోటో కూడా సత్రములో వేయించబడుతుంది. రూ.80,000 యిచ్చిన యెడల వారి పేరుతో 30×15 రూమ్ నిర్మించబడుతుంది. 10×25 రూమ్‌కు రూ.50,000 ఇచ్చిన యెడల దాత ఫోటో, పేరు రూములో వేయబడును. దాతకు 100 రోజులు రూము యివ్వబడును. మిగతా రోజులు యాత్రీకులకు యివ్వబడును.

3. <u>వాసవీ భవన్, తిరుమల</u> : తిరుమలలో నిర్మించనున్న నాలుగు అంతస్థుల భవనపు పనులు చురుకుగా సాగుచున్నవి. రెండు హాల్సు 52×100 అడుగులవి (ఒక సెల్లరు, ఒక గ్రౌండు) నిర్మాణములో కలవు. సదరు హాల్సుకు ఈ క్రింది విధంగా డొనేషన్లు స్వీకరించబడును.

I & II ఫ్లోరు రూము డోనార్సు : 10 రూములకు పరిమితము. ఒక లక్ష రూపాయలు విరాళము నొసగు దాతలకు సంవత్సరంలో 30 రోజులు రూము యివ్వబడును. వారి ఫోటో శిలా ఫలక రూములో వేయబడును.

హాల్సు డోనార్సు : 52×10 అడుగుల ఒక అంకణము హాలుకు లక్షరూపాయలు విరాళము నొసగు దాతలకు రూము డోనార్ల మాదిరిగా పరిగణించి సంవత్సరములో 30 రోజులు ఉచితంగా యివ్వబడును. 20 అంకణములు పరిమితం.

మహారాజ పోషకులు : 400 మంది సభ్యులకు పరిమితము. పది వేల రూపాయలు నొసగు దాతలకు సంవత్సరములో ఐదు రోజులు రూము యివ్వబడును. ఫోటో శిలా ఫలకము వేయబడును. వంశ పారంపర్యంగా సభ్యత్వం వుండును.

రాజ పోషకులు : 400 మంది సభ్యులకు పరిమితము. ఆరు వేల రూపాయలు నొసగు దాతలకు సంవత్సరములో మూడు రోజులు రూము యివ్వబడును. నాపరాయిపైన పేరు వేయబడును. వంశ పారంపర్యంగా సభ్యత్వం వుండును. "వాసవీ భవన్, తిరుమల"కు కార్యదర్శి కార్యాలయం, మార్కాపురం అని వ్రాసి ముందుగా పంపు వారి DD మాత్రమే ఆమోదించబడును. చెక్కులు పంపవచ్చును. కాని ఆ చెక్కులు చెల్లివచ్చినప్పుడే సీరియల్ లోకి వచ్చును. అవకాశము లేని వారి పైకము తిరిగి వాపసు పంపు అధికారం సంఘమునకు కలదు. DD లు మార్కాపురం, స్టేటు బ్యాంకు, వైశ్యా బ్యాంక్, సిండికేట్ బ్యాంక్ లపై పంపగోర్తాము. త్వరలో తిరుమలలో ఆఫీసు ఓపెన్ చేస్తాము. అంతవరకు పై అడ్రసుకు పంపకోర్తాము.

4. <u>వాసవీ నిలయం, పెనుగొండ</u> : పరిశీలనలో ఉంది.

5. <u>వాసవీ ఆర్యవైశ్య బీద విద్యార్థి నిధి</u>

మన సంఘము ద్వారా నిరుపేద వైశ్యుల విద్యాభివృద్ధి నిమిత్తం మూల ధనం ఏర్పాటు చేసి అందులకు రాబడు వడ్డీని నిరుపేద వైశ్యుల అప్లికేషన్లు తీసుకొని అందులో విద్యార్హతలు ఎక్కువ గల వారికి సహాయము చేయులాగున తీర్మానించినాము.

ఒక వైశ్యుడు మరొక వైశ్యునకు డైరెక్టుగా సహాయం చేసి బాగుపరచే విధానం శూన్యంగా యున్న ఈ సమయంలో ఒక నిరుపేద విద్యార్థిని చదివించి ఉత్తీర్ణుడిని చేస్తే ఆ బీద విద్యార్థి ఇతరులకు సహాయము చేయకున్నా అతని సంతతికి అనగా కొడుకులు మనుమలు వరుసగా చదివించుకొని బాగుపడుదురుగదా! అలా సహాయము జరుగకున్న ఆ బీద విద్యార్థి చదువు లేక అతని వంశ మంతయు నిరుపేద లౌతారుగదా. కాబట్టి ఈ

పద్ధతి పూర్తిగా సాగి నిరుపేదలు చదివితే కొన్ని సంవత్సరములకైన మన వైశ్యులు విద్యావంతులై గవర్నమెంటులోనో, ప్రవేటు సంస్థల్లోనో, వ్యాపారంలోనో, ఇండస్ట్రీస్ ద్వారానో అభివృద్ధి చెందగలరు. కాన పరమేశ్వరుడు తమకు కలుగ జేసిన ధనములో ఈ క్రింది విధంగా విరాళముల నొసంగ ప్రార్థన.

ఒక లక్షరూపాయలు సమర్పించిన వారి ఫోటో నాలుగు సత్రములలో వేయబడును. వారి పేరు నాపరాయి పైన నాలుగు సత్రములలో వేయబడును. వీరికి వంశపారంపర్య సభ్యత్వం కలదు. వీరికి సంవత్సరములో 25 రోజులు ప్రకారం అన్ని సత్రములలో రూము కేటాయించబడును.

రు.10116.00 సమర్పించినవారు మహారాజ పోషకులు. యీ సంఘమున వంశపారం పర్య సభ్యులు. వీరి ఫోటో మన సంఘము నిర్వహించు అన్ని సత్రములలో వేయబడును. వీరి పేరు కూడా అన్ని సత్రములలో నాపరాయి పైన చెక్కించబడును.

రు.5116.00 సమర్పించిన రాజపోషకులు. వీరికి వంశపారంపర్యంతం సభ్యత్వం కలదు. వీరి ఫోటో దాత కోరిన మన సత్రములలో రెండు చోట్ల వేయబడును. వీరి పేర్లు అదే రెండు సత్రాలలో నాపరాయిపైన చెక్కబడును.

రు.2116.00 సమర్పించిన వారు పోషకులు. వీరికి వంశపారంపర్య సభ్యత్వం. వీరి ఫోటో దాత కోరిన ఒక సత్రములో వేయబడును. వీరి పేరు నాపరాయి పైన అదే సత్రములో వేయబడును.

రు.1116.00 సమర్పించిన వారు సభ్యులు. వీరికి వంశ పారంపర్య సభ్యత్వం కలదు. వీరి పేరు దాత కోరిన ఒక సత్రములో నాపరాయిపైన వేయబడును.

పై ధనమునకు వచ్చిన వడ్డీ పంపకం కమిటీ తీర్మానం ప్రకారం నిరుపేద వైశ్య విద్యార్థులలో మెరిట్ కల వారికి పంచబడును.

6. వాసవీ అష్టోత్తర శతహోమకుండ వార్షిక మహా క్రతువు రాబోవు నవంబరులో పుట్టపర్తిలో పెట్టుటకు ఏర్పాట్లు చేయుచున్నాము.

–: ప్రత్యేక ఉత్తర ప్రత్యుత్తరములకు :–

మూర్తి వెంకటేశ్వర్లు, వాసవీ సత్రముల కార్యదర్శి కార్యాలయం,

మార్కాపురం – 523 316. ప్రకాశం జిల్లా, ఆంధ్ర ప్రదేశ్.

అధ్యక్షులు : ఆత్మకూరు నాగభూషణం శ్రేష్ఠి, నంద్యాల.

N.B :- పై సత్రముల పేరుతో – D.D. లు కాని, చెక్కులుకాని పంపకోర్తాము. ఎవరు అడిగినను డబ్బు యివ్వవద్దు. కొంతమంది దొంగలు డబ్బు వసూలు చేయుచున్నారు. గ్రహించకోర్తాము.



# వాస్తుశాస్త్రం - ఓవర్‌హెడ్ ట్యాంక్



'వాస్తు విద్యాప్రవీణ' శ్రీమతి బి.లక్ష్మీకాంతమ్మ, ప్రొద్దుటూరు.

అది ఆదివారం. ప్రభాత సమయం. సూర్యభగవానుడు తన లేత బంగారు కిరణాలతో ప్రకృతిని సువర్ణమయం చేస్తున్నాడు. అపుడు నెల్లూరు నుండి కొందరు వాస్తుజిజ్ఞాసువులు వచ్చారు. సూర్యుని వారం. సూర్యుని దిశ తూర్పు. మాకు నెల్లూరు తూర్పు. వారిని చూడగనే, అయ్యా! నెల్లూరివారు అదృష్టవంతులు అన్నాను. ఎందుచేతనంటే, నెల్లూరికి తూర్పున విస్తారమైన పులినప్రదేశమూ, సముద్రమూ వున్నవి. కనుక ఇంటికి తూర్పున ఖాళీ వుంచనక్కర లేదు. జలము నింపనక్కరలేదు. అని చమత్కరించాను. అయ్యో రామ. ఈ వాస్తు ప్రచారకులతో చస్తున్నాము. నెల్లూరికీ ఒకటేవాస్తు. బొంబాయికీ ఒకటేవాస్తు. తూర్పు వదల వలసిందే. నీళ్ళు నిలుప వలసిందే. ఈ వాస్తు చెప్పడానికి ప్రత్యేక పండితులక్కర లేదు. తాపీమేస్త్రీ చెపుతాడు. నైరృతి కోణంలో ఒక చెంబెడు నీళ్ళు పోస్తే, ఆ నీళ్ళు దొర్లుకుంటూ వచ్చి యీశాన్య కోణంలో నిలవాలి. ప్రతి గదిలో ఇదేవాటం వుండాలి. గృహ ద్వారాలన్నీ యీశాన్యం వైపు మొగ్గి యీశాన్యం చూడాలి. తూర్పు-ఉత్తరం ఎంత ఖాళీ స్థలం వుంటే అంత శ్రేష్టం. అంతేకాదు. ఎంత తగ్గు, పల్లం-వుంటే అంత శ్రేష్ఠం. ఈశాన్య కూపం శతకోటి శుభాలకు పుట్టినిల్లని చెపుతారు. అది యెంత లోతు వుంటే అంత శ్రేష్ఠం. పాతాళలోకం దాక బావి త్రవ్వితే ఇక చెప్పాలా? అమ్మా! ఇదంతా 'రామరాయ వాస్తుశాస్త్రం' రేపిన దుమారం. దానితో చస్తున్నాం. వాస్తు ప్రచారకులు, వాస్తు ప్రబోధకులు, వాస్తు పరిశోధకులు, అందరూ ఆ గోత్రం వారే. ఆ సూత్రాలు వల్లించేవారే. ఇపుడు మాకు కొత్తసమస్య వచ్చిపడింది. ఓవర్ హెడ్ ట్యాంక్ ఎక్కడ ఏర్పాటు చేసుకోవాలి? అని ప్రశ్నించారు. వాస్తుప్రచారకు లేమంటున్నారు? నైరృతిలో పెట్టుకోమంటున్నారు. మరి. సందేహమెందుకు? నైరృతిలో బావి వుంటే యజమాని చస్తాడని చెప్పారు. ఇపుడు నీళ్ళట్యాంకి నైరృతిలో పెట్టుకో మంటున్నారు. తప్పు కదా. వారిలో ఒకాయన అన్నారు. అమ్మా! నైరృతిలో క్రింద నీళ్ళుంచరాదు. పైన వుంచవచ్చు. క్రింద మీద అనేది సమస్య కాదు. నైరృతిలోని జలం వాడుకొనగూడదు అన్నారు రామరాయవాస్తుకర్త. నైరృతిలో ఓవర్ హెడ్ ట్యాంక్ నిర్మాణం వారి మతం ప్రకారం దోషం. మృత్యుప్రదం.

ఈనవవాస్తుశాస్త్రనిర్మాత ఏమన్నాడు? ఈశాన్యంలో జలం వుండి తీరాలన్నాడు.

ఎందుకు? అంటే, ఈశాన్య దిశకు అధిపతి ఈశానుడు. అంటే శివుడు. శివుడు గంగాధరుడు. అంటే తలమీద గంగను ధరించినవాడు. కనుక మనము మన యింటికి ఈశాన్య కోణంలో గంగను సృష్టించాలి. ఇది వారి సిద్ధాంతం. ఇంతకు మించి, యేశాస్త్రమూ ఈశాన్యకోణంలో జలం నిలపాలని చెప్పలేదు. వీరి సిద్ధాంతం ప్రకారం పోతే, శివుని తలమీద గంగ వుంది కనుక, ఇంటి తలమీద నీళ్ళ ట్యాంక్ నిలపాలి. అపుడు గంగాధరుడు సంతోషి స్తాడు. శివుని దిశ మడుగు చేస్తే, అంటే జలమయం చేస్తే, శివుడు ఎక్కడ నిలవాలి? విష్ణువైతే మడుగులో శేష శయనుడై నిలుస్తాడు. ఆలోచించండి.

శివుడు గంగాధరుడే కాదు. ఖట్వాంగ ధరుడు. చేతిలో మంచం కోడు పట్టు కొని వుంటాడు. ఫణిధరుడు. మెడలో పాములు వేసుకొని వుంటాడు. కపాల మాలాధరుడు. తలపుర్రెలు ధరించి వుంటాడు. శ్మశానవాసి. ఒలుకల మిట్టలో వుంటాడు. శివప్రీత్యర్థం గంగను నిలిపితే సరిపోతుందా? పాములు, పుర్రెలు, గోరీలు, భూతపరివారమూ ఏర్పాటు చేయవలసి వస్తుంది.

అగ్ని మూలకు అగ్ని అధిపతి కనుక అగ్ని అనగా వంటయిల్లుండ వలెను అన్నారు. మంచిదే. పశ్చిమదిశకు వరుణుడు అధిపతి. వరుణుడు జలాధి దేవత. కనుక పడమట వరుణ ప్రీత్యర్థం నీళ్ళు నింపవలదా? పడమట బావి చచ్చినా ఒప్పు కోరు. మరి ఈశాన్యంలో జలం వుండాలనే సిద్ధాంతం సరియైన దేనా? చెప్పండి.

కేవలం నైరృతి ఉన్నతంగా వుండాలనే సిద్ధాంతం మీద ఆధారపడి ఓవర్ హెడ్ ట్యాంక్ నైరృతిలో కట్టిస్తున్నారు. నైరృతి నుండి సర్వ గృహానికి నీరు సరఫరా అవుచున్నదనే సత్యం గమనించరు.

రాహుబలం కలిగిన వ్యక్తి నైరృతి కోణంలో బావి త్రవ్వించి, ఆ బావి నీటితో స్నానం చేస్తూ, ఆ బావి నీటినే వంటకు ఉపయోగిస్తూ వుంటే అతని దేహారోగ్యం దృఢంగా వుంటుంది. శ్రీసంపదలు కలిసివస్తాయి.

ఈ వ్యక్తి ఈశాన్య కూప జలం ఉప యోగిస్తే యోగభ్రష్టుడవుతాడు. ముందు గా బంగారం కరిగిపోతుంది. క్రమంగా జ్యేష్ఠపుత్రుడు మూర్ఖుడై దుర్వ్యయం చేస్తాడు. తండ్రితో విభేదిస్తాడు. ఈ పరిణామాలు ఈశాన్యదిశలో అధికంగా ఖాళీ స్థలం వదలి, బావి త్రవ్వించుకొన్న వారిలో నూటికి తొంబయి అయిదు మందికి తప్పవు. అనుభవైక వేద్యాలు.

“మూడుకనులవాని మూల పెంచినవాడు
తలకు చెదలు పట్టి కలత జెందు
కొడుకు మాట వినడు కొల్లపోవు పసిండి
విశ్వదాభిరామ వినుర వేమ.”

మూడు కనులవాడు ఈశానుడు. అతని మూల ఈశాన్యము. ఈశాన్యము పెంచుట, ఖాళీగా వుంచుట అరిష్టదాయకం.

# రామచరిత మానసం

( తులసీ రామాయణము )

తెలుగు సేత : శ్రీ గాధంశెట్టి శ్రీరాములు, యం.ఎ.

( గత సంచిక తరువాయి )

తెగిపోయిన తన భర్త తలలు చూడగానే మండోదరి వ్యాకులతతో మూర్ఛపోయింది. స్త్రీలంతా చుట్టు ముట్టారు. ఏడవడం మొదలెట్టారు.

అందరూ కలిసి రావణుడు పడిపోయిన చోటుకు వచ్చారు. భర్త దురవస్థ చూసి మండోదరి భోరు భోరున ఏడ్చింది. తన భర్త ప్రతాపాన్ని తల్చుకుంది. శ్రీరాముని మహత్తును స్మరించింది.

తన బంధువులంతా ఏడుస్తూ వుండడం చూసి చింతించిన విభీషణుడు వాళ్ల వద్దకు చేరుకున్నాడు. సోదరుని దుస్థితి చూసి దుఃఖపడ్డాడు. రాముడు పంపించగా లక్ష్మణుడు వచ్చి విభీషణుణ్ణి ఓదార్చాడు.

విభీషణుడు రామాజ్ఞ ప్రకారం రావణుడికి శాస్త్ర ప్రకారం శ్రాద్ధ కర్మలు జరిపాడు.

శ్రీరాముడు తన తండ్రి మాట ప్రకారం నగర ప్రవేశం చేయ కూడదు గాబట్టి, లక్ష్మణుని, సుగ్రీవుని, అంగదుని, నలుడిని, నీలుడిని, జాంబవంతుని, హనుమంతుని లంకా నగరం పంపి విభీషణుడికి పట్టాభిషేకం జరిపించాడు.

లంకకు వెళ్లి, సీతాదేవికి ఈ సమాచారమంతా వినిపించి క్షేమ సమాచారం తెలుసుకొని రమ్మని శ్రీరాముడు హనుమంతుణ్ణి పంపించాడు.

ఆంజనేయుడు శీఘ్రంగా వెళ్లి దూరాన్నుంచే సీతాదేవికి ప్రణామం చేశాడు. హనుమంతుణ్ణి గుర్తించిన సీతాదేవి రామలక్ష్మణుల క్షేమ సమాచారం అడిగింది.

యుద్ధ భూమిలో పదితలల రావణుడు సంహరింపబడడం, విభీషణుడికి లంకా రాజ్యం కట్ట బెట్టడం విని సీతాదేవి సంబర పడిపోయింది. శరీరం పులకరించింది. కళ్లవెంట ఆనంద బాష్పాలు రాలాయి.

"హనుమా, ఇంతకంటే గొప్ప శుభ వార్త ముల్లోకాల్లో మరే మీ వుండదు. ఈ శుభ సందర్భంలో నేను నీకు ఏమీ బహుమానం ఇచ్చేది?" అంది సీతాదేవి ఆనందంతో

"అమ్మా, యుద్ధ క్షేత్రంలో శత్రు సేనలను సంహరించిన, నిర్వికారుడైన రామచంద్రమూర్తికి సేవ చేయ గలుగుతున్నాను. ఇంత కంటే మరేం కావాలి నాకు?" అన్నాడు హనుమ సంతోషంగా.

"ఆంజనేయా! నీలో సమస్త సద్గుణాలు నిండివుండుగాక, లక్ష్మణ సహితుడైన రాముడు ఎల్లవేళల నీ యందు ప్రసన్న చిత్తుడై వుండుగాక" అంటూ సీతాదేవి హనుమంతుణ్ణి దీవించింది. నీల మేఘ శ్యాముడైన తన ప్రభువు దర్శన భాగ్యం లభింపచేయమని కోరింది.

హనుమంతుడు రాముని వద్దకెళ్లి సీతాదేవి క్షేమసమాచారం తెలియ చేశాడు.

శ్రీ రాముడు వెంటనే అంగదుణ్ణి విభీషణుణ్ణి పిల్చి హనుమంతుని వెంట వెళ్లి సీతాదేవిని సగౌరవంగా తొడుకొని రమ్మని చెప్పి పంపాడు.

వాళ్లందరూ వెంటనే అశోక వనానికి వెళ్లారు. రాక్షస స్త్రీలంతా వినయ పూర్వకంగా సీతాదేవికి సేవలు చేస్తూ వున్నారు. విభీషణుడు వాళ్లందరికీ చెప్పవలసిన మాటలు చెప్పాడు.

రాక్షస స్త్రీలు సీతాదేవికి స్నానం చేయించారు. అనేక రకాల నగలు అలంకరించారు. ఒక అందమైన పల్లకీ తెప్పించారు. సీతాదేవి పరమానందంతో రామనామస్మరణ చేస్తూ ఆ పల్లకీ ఎక్కి కూర్చుంది. పల్లకీ బయలుదేరింది. పల్లకీ వెంట రాక్షస వీరులు బయలుదేరారు. అందరి మనస్సులు వుల్లాసంగా ఉన్నాయి. ఎలుగుబంట్లు, వానరులు సీతాదేవిని దర్శించు కోడానికి వచ్చారు. కాని రాక్షస వీరులు వాళ్లను దూరంగా తరిమారు. వాళ్లు వెళ్లి రాముడికి మొర పెట్టుకున్నారు.

అప్పుడు రాముడు సీతాదేవిని పల్లకీ దింపి, అందరూ ఆమెను దర్శించడానికి వీలుగా కాలినడకన తీసుక రమ్మని ఆదేశించాడు. ఆ విధంగా సీతాదేవి కాలినడకన వస్తూవుండగా వానర భల్లూకాలందరూ ఆ తల్లిని దర్శనం చేసుకొని ధన్యులయ్యారు. ఆకాశం మీద నుంచి దేవతలు పూలవాన కురిపించారు.

సీతాదేవి అసలు స్వరూపం మొదట అగ్నియందు వుంచబడింది. అంతర్యాములైన సాక్షిదేవతలు ఆమెను బయటకు పంపాలను కుంటున్నారు. అందువలన కరుణానిధియైన శ్రీ రాముడు సీతాదేవిని కఠోరంగా మాట్లాడాడు. ఇదంతా ఆయన లీల మాత్రమే!

ఆ మాటలు విన్న రాక్షసస్త్రీలు విషాదం చెందారు.

సీతాదేవి రాముని ఆజ్ఞకు తల వంచింది. మనోవాక్కాయ కర్మల చేత పవిత్రురాలైన సీతాదేవి లక్ష్మణుని పిలి తనకు సహాయకారిగానిల్చి అగ్నితయార చేయమని కోరింది. నీతి దాయకమై సీతాదేవి మాటలు వినగానే లక్ష్మణ కళ్లవెంట నీళ్లు కారాయి. చేతులు జోడించి నిలబడ్డాడు. రాముడితో ఏమీ మాట్లాడ లేకపోయాడు. అన్నగారి మనస్సు తెలుస కున్నాడు. పరుగు పరుగున వెళ్లి కట్టెల పేర్చి అగ్ని అంటించాడు. గన గన మండిపోతున్న అగ్ని చూసి సీతాదే మనస్సులో సంతోషం కలిగింది. భయ కలగలేదు.

మనోవాక్కాయ కర్మల చేత న హృదయంలో శ్రీ రామచంద్రుడికి తప్ప మరొకరికి స్థానం లేకున్నట్లయితే, అంద మనస్సులు తెలుసుకోగల అగ్నిదేవుడ నాయందు మంచిగంధం లాగా శీతలమం పోవుగాక – అంటూ శ్రీ రాముడి మనస్సులో తల్చుకుంటూ సీతాదే అగ్నిప్రవేశం చేసింది. దాంతో ఛాయాసీ ఆమె యొక్క లౌకిక కళంకమూ అగ్ని యందు భస్మమైపోయాయి. శ్రీ రాము యీ లీల మరెవ్వరికి తెలియద దేవతలు, మునులు, సిద్ధులు అందర ఆకాశంలో నిల్చొని చూస్తూ వున్నార అప్పుడు అగ్ని దేవుడు ప్రత్యక్ష వేదాల్లోనూ, లోకంలోనూ ప్రసిద్ధురాలై అసలు సీతను చెయ్యి పట్టుకొని తొడ

వచ్చి, క్షీరసాగరుడు విష్ణుమూర్తికి లక్ష్మీదేవిని అప్పగించినట్లు అప్పగించాడు. అపుడు సీతాదేవి శ్రీరాముని వామ భాగాన విరాజిల్లింది. ఆ క్షణాన ఆమె చక్కదనం చెప్పనలవి గాకుండా వుంది. అప్పుడే వికసించిన నీల వర్ణపు కమలం ప్రక్కన బంగారపు కమలం మొగ్గలాగా శోభాయ మానంగా వుంది.

దేవతలు ఆనందంతో పూలవాన కురిపిస్తూ వున్నారు. ఆకాశంలో భేరీలు మోగుతూ వున్నాయి. కిన్నరులు గానం చేస్తూ వున్నారు. అప్సరసలు విమానా లెక్కి నాట్యం చేస్తూ వున్నారు.

సీతారాముల అపారమైన శోభను చూస్తూ వానర భల్లూకాలు ఆనందంతో గంతులు వేస్తూ జయజయ నాదాలు చేశాయి.

ఇంద్రుని సారథి మాతలి రాముని అనుమతి పొంది తన రథం తీసుకొని వెళ్లిపోయాడు.

అటు తరువాత దేవతలు వచ్చి శ్రీరాముని మహత్తును కొనియాడారు. అటు పిమ్మట బ్రహ్మదేవుడు వచ్చి రాముని స్తుతించాడు.

ఆ వెనుక దశరథుడు అక్కడకు వచ్చాడు. కుమారుణ్ణి చూసి ఆనంద బాష్పాలు రాల్చాడు. రామలక్ష్మణులు తండ్రికి నమస్కరించారు. దశరథుడు ఆశీర్వదించాడు. అప్పుడు రాముడు తండ్రీ మీ పుణ్య విశేషం వల్లనే నేను అజేయుడైన రాక్షస రాజును జయించ గలిగాను?" అనగానే దశరథుని హృదయం ఆనందంతో నిండిపోయింది. రాముడు దశరథునకు తన స్వరూప జ్ఞానం కలుగజేశాడు.

పార్వతీ, దశరథుడు భేద భక్తిలో మనస్సు లగ్నం చేసినందున మోక్షం పొంద లేదు. సగుణోపాసన చేసే వ్యక్తులు మోక్షం కోరరు. వాళ్లకు రాముడు తన భక్తిని కలుగ జేస్తాడు.

దశరథుడు రామభక్తి పొంది దేవ లోకానికి వెళ్లిపోయాడు.

సీతారామలక్ష్మణులు శోభాయ మానంగా వెలిగి పోతూ వుండడం చూసి ఇంద్రుడు కీర్తించాడు.

ఇంద్రుని కీర్తనలు విన్న రాముడు యుద్ధంలో చనిపోయిన వానర భల్లూ కాలను బ్రతికించమన్నాడు.

ముల్లోకాలను చంపి బ్రతికించగల రాముడు ఇచ్చట ఇంద్రుడికి గొప్ప తనం కలుగజేశాడు.

ఇంద్రుడు అమృతం కురిపించి వానర భల్లూ కాలను బ్రతికించాడు. అమృతం యుద్ధంలో చనిపోయిన ఇరుపక్షాలపైన వర్షించింది. కాని వానర భల్లూకాలు మాత్రమే బ్రతికారు. రాక్షసులు బ్రతకలేదు. వాళ్లందరి మనస్సులు చనిపోయేటప్పుడు రామాకారం పొందాయి. కనుక వాళ్లందరికీ మోక్షంలభించింది. కాని వానర భల్లూ కాలు దైవాంశ కలిగిన వారు కాబట్టి రాముని కోరికతో బ్రతికారు.

రాముని వంటి దీన దయాళువు మరెవరున్నారు? రాక్షసు లందరికీ మోక్షం కలుగ జేశాడు. కాముకుడు, దుష్టుడు, పాపి అయిన రావణుడికి శ్రేష్ఠమునులకు కూడా లభించని ముక్తిని ప్రసాదించాడు.

దేవతలంతా అందమైన విమానా లెక్కి పూల వాన కురిపించి వెళ్లిపోయారు. అదే మంచి అవకాశమని తలంచి ఈశ్వరుడు రాముని వద్దకు వచ్చాడు. పరమ ప్రేమతో చేతులు జోడించి

కమలనేత్రాలతో ఆనంద బాష్పాలు కురిపిస్తూ పులకితగాత్రుడైన త్రిపురారి ఈశ్వరుడు రఘురాముణ్ణి కీర్తించాడు.

"శ్యామ సుందరా, కమలనయనా, దీన బంధూ, శరణాగత రక్షకా, రామచంద్ర ప్రభూ, లక్ష్మణ, జానకీ సహితంగా నిరంతరం నా హృదయంలో నివసించు. నువ్వు మునులకు ఆనందాన్ని చేకూర్చే వాడివి. భూమికే అలంకారాన్ని కలుగ జేసే వాడివి. తులసీదాసుకు ప్రభుడవు భయాన్ని హరించే వాడివి. అయోధ్యలో నీ పట్టాభిషేకం జరిగేటప్పుడు నీ లీలలు చూడ్డానికి నేను వస్తాను" అంటూ విన్న వించుకొని ఈశ్వరుడు వెళ్లి పోయాడు.

అటు వెనుక విభీషణుడు రాముని వద్దకు వెళ్లి తన కృతజ్ఞతలు తెలియచేసి లంకాపట్టణానికి రమ్మని కోరాడు.

అప్పుడు రాముడు భరతుని పరిస్థితి వివరించి "భరతుడు మునివేషం దాల్చి జీర్ణ శరీరుడై నిరంతరం నా నామాన్ని జపిస్తూ వున్నాడు. గడువు దాటిన తరువాత నేను వెళ్లినట్లయితే భరతుణ్ణి సజీవునిగా చూడలేకపోతాను. కాబట్టి వెంటనే అయోధ్యా ప్రయాణానికి ఏర్పాట్లు చూడు.

నువ్వు కల్పాంతం వరకు రాజ్యం చేస్తూ వుండు. నా నామం స్మరిస్తూవుండు. అటు తరువాత నా లోకానికి చేరు కుంటావు" అన్నాడు.

ఈ మాటలు విన్న విభీషణుడు ఆనందంతో శ్రీ రాముడికి నమస్కరిం చాడు. తన మహలుకు వెళ్లాడు. పుష్పక విమానం నిండా మణులు, వస్త్రాలు రత్నరాసులు నింపాడు. ఆ విమానాన్ని తెచ్చి రాముని వద్ద వుంచాడు. అప్పుడు రాముడు కోరిన కోర్కె ప్రకారం విభీషణుడు ఆకాశంలోకి వెళ్లి ఆవస్త్రాలను, రత్నరాసులను క్రిందకు కురిపించాడు. వానరు భల్లూకాలు నగలను, వస్త్రాలను అందుకొని అలంకరించుకొని ఆనందంగా రాముని వద్దకు వెళ్లారు. ఆభరణాలు అలంకరించుకొని అందంగా కనపడుతున్న వానరులను చూసి రామచంద్రుడు చాలా సంతోషించాడు.

"మిత్రులారా, మీ సహాయంతోనే నేను రావణుని సంహరించాను. విభీషణు డికి పట్టాభిషేకం చేశాను. ఇక మీరంతా మీ మీ ఇళ్లకు వెళ్లండి. నన్నుస్మరిస్తూ వుండండి. నిర్భయంగా వుండండి" అని అభయం ఇచ్చాడు.

వానర రాజు సుగ్రీవుడు, నలుడు, నీలుడు, జాంబవంతుడు, అంగదుడు, హనుమంతుడు, విభీషణాదులను శ్రీ రాముడు విమానం ఎక్కించు కున్నాడు. వెంటనే విమానం ఉత్తర దిశగా ప్రయాణం సాగించింది. విమానం బయలుదేరగానే పెద్దగా జయజయ ధ్వనులు వినిపించాయి. విమానంలో ఎత్తయిన మనోహర సింహాసనం వుంది. అందులో సీతా సహితంగా రామచంద్రుడు ఆశీనుడయ్యాడు. విమానం వేగంగా పోతూ వుంది. దేవతలు సంతోషంతో పూల వాన కురిపించాడు. శీతల, మంద, సుగంధిత వాయువు వీస్తూ వుంది. జలాశయాలన్నీ నిర్మలంగా వున్నాయి. నలువైపుల శుభశకునాలు కనిపిస్తూ వున్నాయి. అందరి మనస్సులు ప్రసన్నంగా వున్నాయి. ఆకాశము, దిశలు నిర్మలంగా వున్నాయి.

(ఇంకా ఉంది)

# మహాసభకంటే ఎక్కువ చేస్తున్నారు

ప్రియసోదరా!

ఈ సంవత్సరాదినాడు ఉదయం కడప రేడియో స్టేషను నుండి ప్రసారమైన 'సాహితీవేత్త దోమావేంకటస్వామి గుప్త' అను మీ ఉపన్యాసము విని చాలా ఆనంద మైనది. దీనిని విన్న ప్రతి వైశ్యునికీ ఉగాది పండుగనాడు ఉదయమే పంచభక్ష్య పరమాన్నసహిత భోజనం చేసినంత ఆనందము కలిగి వుంటుందనుటలో ఏ మాత్రము అతిశయోక్తి ఉండదు.

ఈనాడు మనవారు ఎంత చదువుకున్నా, ఎంత సంపాదించుకున్నా, మన వాళ్లను మరచిపోయి, ఇతరులను పొగడుతూ, ఇతరులను కొండెక్కించి వారి ప్రచారము కొరకు ఖర్చుపెడుతున్నారు. ఇది చాలా విచారించవలసిన విషయము. ఈ విషయములో మన ఆర్యవైశ్య మహాసభ గూడ ఘోరముగా విఫలమైనదని చెప్పక తప్పదు. మీ ఉపన్యాసము విన్న తర్వాత దోమా వెంకటస్వామి గుప్త మేటి కవి, ప్రబంధకర్త, రచయిత, అష్టావధాని, శతావధాని అయిన సర్వతోముఖ సాహితీవేత్త (Allround Lite Matteur) నభూతో నభవిష్యతి అనిపిస్తుంది. అటువంటి వ్యక్తి వైశ్యుడైనందుకు మనమంతా గర్వించాలి. అజ్ఞాతములో వున్న ఆయన రచనల ప్రచురణకు నడుము కట్టాలి. ఇందుకు మీరు ఈ కవిగారి పేరిట సాహిత్యపీఠాన్ని స్థాపించి, చేస్తున్న కృషి ప్రతి వైశ్యుడికీ, మీదు మిక్కిలి ఆర్యవైశ్య మహాసభకు కనువిప్పు కావాలి. ఈ విషయమై మీరు చేస్తున్న కృషి ఎంతైనా అభినందనీయము. ఈనాడు మన ఆర్యవైశ్య మహాసభ వైశ్యుల దాతృత్వగుణాన్ని ఆధారంగా తీసుకుని, విరాళాలు వసూలు చేసి, మహాసభ భవనాన్ని, వైశ్యుల వసతి గృహాన్ని నిర్మించి అందులో తమకు శాశ్వతంగా రాష్ట్ర రాజధానిలో ఒక Head Quarters లాంటిది ఏర్పాటు చేసుకుని అంతటితో ఆనందిస్తున్నారే తప్ప నిజంగా మన సంఘీయుల సేవా కార్యక్రమాలు ఏవియూ చేపట్టకపోవడము విచారకరము. ఈ మధ్య మన సంఘాలు బిరుద ప్రదానము గావించిన 'వైశ్యరత్న'లు ఎందరో వున్నారు. ఈ బిరుదు తీసుకున్న వ్యక్తులు వారి బిరుదును సార్థకము చేసుకొనుటకు ఏమి చేయుచున్నారో అర్థము కాదు. అంతేకాని మట్టిలో దాగిన మన జాతి రత్నాల గొప్పదనాన్ని మన సంఘీయులకు తెలియజేయవలసిన ఆవశ్యకత ఎంతైనా వుంది.

ఈ విషయములో మీరు ఒక వ్యక్తిగా కొన్ని మిలియన్ల ఆర్థిక సంపద కలిగిన మహాసభకంటే ఎక్కువ సేవచేస్తూ మీ "వైశ్య భూషణ" బిరుదును సార్థకము చేసుకుంటున్నారు. ఈ సందర్భముగా కొన్ని సంవత్సరాల క్రిందట మీరు ప్రయత్నించి కడప రేడియో స్టేషను నుండి "వాసవీ సుప్రభాతాన్ని" ప్రసారము

చేయించడము వైశ్యులకు చాలా మటుకు తెలిసియే వుంటుంది. మరల మీరు వ్యక్తిగతంగా ప్రయత్నించి, శ్రమపడి, మీ కార్యదర్శిత్వంలో నడుస్తున్న "శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవ్యాలయాలు, ఆర్య వైశ్య ధర్మసంస్థల సమాఖ్య" పేరుతో ప్రయత్నించినట్లు చెప్పుతూ 20.5.94వ తేదీన కడప ఆకాశవాణిలో ఉదయం 6గం. 10 ని.లకు భక్తిరంజని కార్యక్రమములో శ్రీ జమిలి నమ్మాళ్వారు గారు రచించిన శ్రీ వాసవీసుప్రభాతాన్ని ప్రసారం చేయించటం మీ వ్యక్తిగత సాధనే (Achievement) తప్ప వేరుకాదు అని ఘంటాపథంగా చెప్పగలను.

కాని జిల్లా, రాష్ట్ర ఆర్య వైశ్య సంఘాలు కాని కనపడుటలేదు. ఏమి కారణం? తెలియలేదు. జిల్లా రాష్ట్ర సంఘ అధ్యక్ష ఎన్నికలకు వేయి, లక్షలు ఖర్చుచేసే మహానుభావులారా కండ్లుతెరవండి. మన ధర్మ సంస్థలు కొందరు స్వార్థపరుల చేతుల్లోపడి కోట్లాది రూపాయల ఆస్తి అన్యాక్రాంతము అవుతూ వుంటే తెలిసీ తెలియనట్లే వుండే ప్రతి వైశ్యుడు వాసవీ మాత ఆగ్రహానికి, శాపానికి గురికాక తప్పదేమో! ఇది మన జాతి ద్రోహమే అవుతుంది.

"సాహితీవేత్త దోమావేంకటస్వామి గుప్త" అను మీ ఆకాశవాణి ఉపన్యాసాన్ని

- మహాసభ ఘోరంగా విఫలమైంది?
- వైశ్య రత్నాలు ఏమి చేస్తున్నట్లు?
- వాసవీ సుప్రభాత పఠన మీ వ్యక్తిగత సాదనే.
- మన ధర్మసంస్థలు కొందరు స్వార్థపరుల చేతుల్లో పడ్డాయి. కళ్ళు తెరవండి.

గతంలో శ్రీమతి పంగులూరు సీతమ్మ అనే దాతృత్వ శిరోమణి వైశ్యుల సేవార్థమై యిచ్చిన సుమారు పదికోట్ల రూపాయల విలువగల ఆస్తి విషయమై కొంత దురుపయోగము జరుగుతుంటే కొందరు వ్యక్తులు దానిని అడ్డుకునే ప్రయత్నము చేసినట్లు, వారు High Courtకు పోయి కొన్ని స్టే ఉత్తర్వులు తెచ్చినట్లు తెలియుచున్నది. ఈ కృషి చేస్తున్న వ్యక్తులలో "వైశ్య రత్నాలు" (రాళ్ళు కాదు కదా)

యదాతథంగా "వైశ్యప్రబోధిని"లో ప్రచురించి పాఠకలోకానికి దానిని చదివి మన పూర్వీకుల ఉన్నతిని, సాహితీ వైభవాన్ని తెలుసుకునే మహద్భాగ్యాన్ని కలుగజేసినందుకు మిమ్ములను అభినందిస్తున్నాను.

ఇట్లు
సి.వి.సత్యనారాయణ గుప్త M.A., L.L.B.
నంద్యాల.

## సంఘము ఒక మంచి వ్యక్తిని పోగొట్టుకుంది



– రాధా కృష్ణయ్య

వైశ్య ప్రబోధిని జూన్ సంచిక లోని సంపాదకీయం చదివి శ్రీ రాజా శ్రేష్ఠి గారు మరణించారని తెలుసుకొని చాలా చింతించాను. శ్రేష్ఠి గారు చాలా మంచి స్వభావులు. వారితో నాకు చిరకాల పరిచయం ఉంది. సాత్వికులు కూడ. సంపాదకీయములో వ్రాసినట్లు రాజా శ్రేష్ఠి గారు వైశ్య సంఘానికి ఎంతో సేవ చేశారు. వారి మరణం వలన మన వైశ్య సంఘము ఒక మంచి వ్యక్తిని పోగొట్టుకుంది. వారి ఆత్మకు శాంతిని ప్రసాదించమని జగన్మాతను ప్రార్థిస్తున్నాను. అని ఆం.ప్ర. ఆర్యవైశ్య మహాసభ మాజీ అధ్యక్షులు, ప్రముఖ పారిశ్రామిక వేత్తలు శ్రీ కాసంశెట్టి రాధాకృష్ణయ్య గారు రాజాగారికి శ్రద్ధాంజలి ఘటించారు.

## కర్మయోగి రాజా శ్రేష్ఠి

– మల్లయ్య

పోలేపల్లె వెంగన్న (రాజా) శ్రేష్ఠి గారు నిత్య కర్మానుష్ఠానపరులు. దివికేగిన కర్మయోగి. విజ్ఞాన కోవిదులు. వీరి మరణం ఆర్యవైశ్యులకు తీరని లోటు. ఆయనకు నా శ్రద్ధాంజలి అంటూ కడప జిల్లా ఖాజీపేట వైశ్య ప్రముఖులు శ్రీ గూడూరు మల్లయ్య గారు రాజా గారికి శ్రద్ధాంజలి ఘటించారు.

## బందరులో సోమయాజుల వర్ధంతి

వేద వాఙ్మయాన్ని అపోశన బట్టిన అపరకుంభసంభవులు శ్రీ ఆత్మూరి లక్ష్మీ నృసింహ సోమయాజి. ఆయన పేర ఇప్పటి కృష్ణాజిల్లా ముఖ్యపట్టణమైన మచిలీపట్నములో 1915లో 'శ్రీ లక్ష్మీ నృసింహ సోమయాజి వైశ్య సమాజము' అను పేర ఒక సమాజము స్థాపించబడడం పాఠకులకు తెలుసు. ఆ సమాజము వారు 4.7.94 న శ్రీ సోమయాజుల వారి వర్ధంతిని జరిపించారు. ఈ సందర్భంగా జరిగిన సభకు ఆం.ప్ర. ఆర్యవైశ్య యువజన సంఘాల సమాఖ్య మాజీ అధ్యక్షులు, సదరు సమాఖ్య అధ్యక్షులూ శ్రీ జి.వి. గున్నయ్య శ్రేష్ఠి గారు అధ్యక్షత వహించారు. కార్యదర్శి శ్రీ గుడివాడ రామచంద్రారావు గారు స్వాగతం పలికిన ఈ సభలో ఆంధ్రా బ్యాంకు రీజనల్ మేనేజరు శ్రీ బి.రామమూర్తి గారు ముఖ్య అతిధిగా పాల్గొన్నారు. ముఖ్య అతిధి మఱియు పలువురు వక్తలు ఈ సభలో ఆర్యులవారి గొప్పదనాన్ని గురించి మాట్లాడారు. సమాజ సహాయ కార్యదర్శి శ్రీ యం.వి. సీతాపతి గారు వందన సమర్పణ చేశారు.

# చక్కెర వ్యాధి, రక్తపోటు (బీ.పి.) పూర్తిగ బాగైనది.


డా.గ్రంథే రఘురామ గుప్త

'ఆయుర్వేద మార్తాండ' డాక్టర్ గ్రంథే రఘురామగుప్త గారికి, (మార్కాపురం. ప్రకాశం జిల్లా – 523 316.)

ఆర్యా !

నమస్సులు. నేను 20 సం॥లుగ బి.పి. తోను 10 సం॥లు పైగా షుగర్ వ్యాధితోను పీడింపబడితిని. ఎన్నో విధములగు ఔషధములు సేవించితిని. మద్రాసులోని డయాబెటిక్ రీసర్చ్ సెంటర్‌కు 3 పర్యాయములున్ను, ఢిల్లీలోని రాంమనోహర్ లోహియా ఆస్పత్రిలో ఒకసారి పరీక్షలు చేయించుకొని వారి సలహామేరకు ఔషధములు సేవించితిని. కాని, సదరు మందులు సేవించునంత వరకు మాత్రమే వ్యాధులు తగ్గుచుండెడివి. మీరిచ్చిన ఔషధములు నేను పథ్యము లేకుండ 10 మాసములు సేవించితిని. మీ ఔషధ ప్రభావము వలన, నాకు 6 మాసములకు పూర్తి ఆరోగ్యము కలిగినది. ఇప్పటికి ఒక సం॥నకు పైగా నాకు ఆ రోగ చిహ్నములు లేవు. నేను అప్పుడప్పుడు తీపి పదార్థములు కూడ తినుచున్నాను, మీ సిద్ధ వైద్యమునకు నా నమస్కారములు.


డా. జి.వెంకట ప్రసాద్

ఏనుగు చెట్టు వీధి,
ఒంగోలు. ప్రకాశం జిల్లా.
10.7.92.

భవదీయుడు
(Sd.) కొణిజేటి శ్రీమన్నారాయణ,
మాజీ మునిసిపల్ కౌన్సిలర్

ఎంతచేసినా చివరికి మిగిలే ఋణాలు – అర్ధాంతర మరణాలు – మరెన్నో దారుణాలు – సాధారణమనుకొంటున్నారా? ఇలాంటి దుష్పరిణామాలకు మీ యింటి వాస్తు దోషాలు కావచ్చు కారణం.

కాశీ నుండి కన్యాకుమారి వరకు వాస్తు పరిశోధనా పర్యటన గావించి, తన వాస్తు పాండిత్య రచనా వైశిష్ట్యం వలన "వాస్తుశాస్త్ర వాస్తవాలు" పలుపత్రికలలో ప్రచురణ కావడానికీ, గ్రంథం రూపం సంతరించుకొనడానికి కారకుడైన రచయిత – నభూతో నభవిష్యత్తుగా సూత్రీకరింప బడిన "వాస్తు సూక్తుల" నిర్మాత – ఖండాలు, అఖాతాల వాస్తు రీతులను అగాధ పరిశీలనార్థం పాఠకుల ముందుంచిన 1993 వాస్తు క్యాలండర్ సంధాత – శ్రీ బి.నాగభూషణ రెడ్డి గారు పదవీ విరమణానంతరం తన అమూల్య వాస్తు సలహాలను అందించేందుకు ఇప్పుడు అందరికీ అందు బాటులోనికి వచ్చారు. సమస్త వాస్తు సమస్యల పరిశీలనకు, నూతన నిర్మాణాలకు వారిని సంప్రదించండి – సఫలీకృతులు కండి.



**శ్రీ బి. నాగభూషణ రెడ్డి**
వాస్తు పరిశీలకులు
*5–1879, గీతాశ్రమం రోడ్,*
*ప్రొద్దుటూరు – 516 360.* కడప జిల్లా.

దరఖాస్తులు పంపండి

# ప్రాంతీయ వైశ్య విద్యానిధి వారిచే ఆర్థిక సహాయం

పాలిటెక్నిక్, మరియు మెడిసన్ ఇంజనీరింగ్, అగ్రికల్చర్, కామర్సు, సబ్జక్టులతో డిగ్రీ చదువుచున్నట్టి మరియు ఫార్మసీ, ఎమ్.బి.ఎ. చదువు వైశ్య విద్యార్థినీ విద్యార్థులకు బళ్ళారి ప్రధాన కార్యస్థానంగా గల పై విద్యానిధి వారు లోను స్కాలర్ షిప్పులను గతములో మాదిరే ఈ సంవత్సరం కూడ ఇవ్వనున్నారు. ఈ ఆర్థిక సహాయానికి దక్షిణ రాష్ట్రాలలోని వైశ్య విద్యార్థినీ, విద్యార్థులందరూ అర్హులే. ఈ లోను స్కాలర్ షిప్పులను పొందుటకు నిర్దిష్ట దరఖాస్తులో అప్లై చేయాల్సి ఉంది. నిర్దిష్ట దరఖాస్తును, జనరల్ సెక్రటరి, ది ప్రావెన్షియల్ వైశ్య ఎడుకేషన్ ఫండ్, 19, ఫస్ట్ రోడ్డు, గాంధీ నగర్, బళ్ళారి-583103 కు రూ.5/-లు మనియార్డరు ద్వారా మాత్రమే పంపి పొందవచ్చును. పూర్తిచేసిన దరఖాస్తులను స్వీకరించుటకు 15.11.1994 చివరితేదీ అని పై విద్యానిధి జనరల్ సెక్రటరీ శ్రీ పోలా బసవరాజ్ గారు తెలియజేశారు.

## మెరిట్ స్కాలర్‌షిప్పులకు కూడ

పై విద్యానిధి వారు 1994 ఏప్రెల్-జూన్ నెలల్లో వివిధ విశ్వవిద్యాలయాలు నిర్వహించిన మెడిసిన్, ఇంజినీరింగ్, అగ్రికల్చరల్, కామర్సు స్నాతక (డిగ్రీ) పరీక్షలలో పాల్గొని, ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులైన వైశ్య విద్యార్థినీ విద్యార్థులకు మెరిట్ ప్రయిజులు ఇవ్వనున్నారు. ఈ మెరిట్ ప్రయిజులను పొందాలనుకున్న వైశ్య విద్యార్థినీ విద్యార్థులు ప్రత్యేకంగా దరఖాస్తు చేసుకోవాలి. దరఖాస్తులను పై అడ్రసుకు మనియార్డరు ద్వారా రూ.3/-లు పంపి పొందవచ్చును. పూర్తి చేసిన దరఖాస్తు ఫారాలను స్వీకరించుటకు కూడ చివరి తేదీ 15.11.1994. పైన పేర్కొన్న నాలుగు సబ్జక్టులలో చదివిన విద్యార్థులు మాత్రమే అర్హులు. అని కూడ శ్రీ బసవరాజు గారు తెలియ జేశారు.

## కృతజ్ఞతలు

కృష్ణా జిల్లా గుడివాడ లైన్సు క్లబ్బు అధ్యక్షులుగా ఎన్నికైన శుభ సందర్భాన్ని పురస్కరించుకొని గుడివాడ వైశ్య ప్రముఖులు శ్రీ కారంశెట్టి గురుస్వామి గారు రూ.116/-లు, హైదరాబాద్ వాస్తవ్యులు, రిటైర్డు ఛీఫ్ ఇంజినీరు శ్రీ బట్టేపాటి శ్రీరాములు గారు రూ.101/-లు ఈ పత్రికకు విరాళంగా పంపారు. వీరికి మా కృతజ్ఞతాంజలులు.

– సంపాదకులు.

## అనంతపురం శ్రీ వాసవీ వృద్ధాశ్రమ శాశ్వత భవనాలకు శంఖుస్థాపన

అనంతపురం పట్టణములో ఏర్పాటైన శ్రీ వాసవీ వృద్ధాశ్రమ శాశ్వత భవనాలకు ఈ ఆశ్రమ భవనాలకు 2 లక్షల రూపాయల విరాళంగా ఇచ్చుటకు ప్రకటించిన శ్రీ శ్రీరాం వెంకట సుబ్బయ్య గారు 26.6.1994వ తేదీన శంఖుస్థాపన చేశారు. ఈ సందర్భంగా జరిగిన సభకు ఈ ఆశ్రమ గౌరవాధ్యక్షులు శ్రీ కాసంశెట్టి రాధాకృష్ణయ్య గారు అధ్యక్షత వహించారు. మాజీ శాసన మండలి సభ్యులు శ్రీ మేడా సుబ్బయ్య, అనంతపురం జిల్లా ఆర్యవైశ్య సంఘాధ్యక్షులు శ్రీ దొంతి విశ్వనాథగుప్త, ఆశ్రమ అధ్యక్షులు శ్రీ జయం సుబ్రమణ్యం, శ్రీ ఆత్మానందస్వాముల వారలు ఈ సభలో ప్రసంగించారు. కార్యదర్శి శ్రీ గొంది కొండయ్యగారు వందన సమర్పణ చేశారు.

## గుంటూరు డాల్ మిల్స్ అసోసియేషన్‌కు నూతన కార్యవర్గము

పై అసోసియేషన్ సర్వసభ్య సమావేశము 21.5.1994న జరుగ క్రింది వారలు నూతన కార్యవర్గ సభ్యులుగా ఎన్నికయ్యారు. అధ్యక్షులు శ్రీ చీదెళ్ల కమలాసన్ దేవ్, గౌరవ కార్యదర్శి శ్రీ కనమర్లపూడి గాంధీకోటేశ్వరరావు, సంయుక్త కార్యదర్శి శ్రీ చిలంకూరి గౌరీ శంకరరావు, కోశాధికారి శ్రీ అప్పలస్వామి.

## అమరావతిలో శ్రీ వాసవీ ప్రతిష్ఠ

గుంటూరు జిల్లా అమరావతి పట్టణములో ఆర్యజన మహాశయులచే నూతనంగా నిర్మింపబడిన శ్రీ వాసవీ దేవాలయములో 19.6.1994వ తేదీన శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవి విగ్రహ ప్రతిష్ఠ జరిగింది.

## తెలుగు భాషలో ప్రథమ నవలాకారుడు శ్రీ నరహరి గోపాలకృష్ణమ్మ చెట్టి

కీ.శే. నరహరి గోపాల కృష్ణమ్మ చెట్టి గారు 1833 సం.లో, కర్నూలు జిల్లాలో జన్మించిరి. ఈయన 1872 సం.లో 'శ్రీరంగరాజ చరిత్రము' అను ప్రథమ నవలను తెలుగు భాషలో రచించెను. కందుకూరి వీరేశలింగము (1848-1919) 'రాజశేఖర చరిత్ర'ను తర్వాత రచించెను. 'రాజశేఖర చరిత్ర' వ్రాయమని ప్రోత్సహించిన వారు కూడ శ్రీ సమర్థిత రంగయ్య శెట్టి గారు.

('నవల' అంటే కల్పనలతో కూడిన సుదీర్ఘ కథ. ఆంగ్ల సాహిత్య ప్రభావం వలన తెలుగు భాషలో ఒక నూతన ప్రక్రియ యేర్పడినది)

(ఆంధ్రదేశంలో సంఘ సంస్కరణోద్యమాలు (1848-1919) అను గ్రంథము ఆధారముతో)

సేకరణ
చుండూరి అప్పారావు

# ఈ నెలలో మీ కర్తవ్యము

## (21.7.1994 నుండి 20.8.1994 వరకు)

మీరు పంపవలసిన A-2 రిటర్నును చలానాతో బాటు అందుకు సంబంధించిన అమ్మకం పన్ను అధికారికి పంపుటకు ఆగస్టు నెల 20వ తేదీయే చివరిది. మీరు పంపు ఆ A-2 రిటర్నును చలానాతో బాటు కాకుండా, చెక్కుతో బాటు పంపాలను కుంటున్నారా? ఆ విధంగా ఆ A-2 రిటర్నును చెక్కుతోబాటు పంపుటను ఈ ఆగష్టు నెల 15వ తేదీ లోగానే చేయాలి.

## లక్ష్మీ నృసింహ వైశ్య సమాజము వారిచే 45 వేల నిధుల పంపిణీకి తీర్మానం

మచిలీపట్నంలోని శ్రీ లక్ష్మీనృసింహ సోమయాజి వైశ్య సమాజము వారు 12.6.94వ తేదీన సమాజ అధ్యక్షులు శ్రీ జి.వి.గున్నయ్య శ్రేష్ఠి గారి ఆధ్యక్షతన సమావేశమై 1994-95 సంవత్సరానికి విద్యా నిధి నుండి 30 వేలు, పోషక నిధి నుండి 5 వేలు, వైద్య నిధి నుండి 5 వేలు, వివాహ నిధి నుండి 5 వేలు వెరశి 45 వేల రూపాయలను పేద వైశ్యుల సేవలకు ఖర్చు చేయాలని తీర్మానించారు.

## కుంభాభిషేకం

మద్రాసు మహానగరము, కొత్వాల్ మార్కెట్‌లోగల శ్రీ వాసవీ కన్యకా పరమేశ్వరీ దేవస్థాన మహాకుంభాభిషేకము 27.6.1994న జరిగింది. 24.6.1994న ప్రారంభమైన యీ కార్యక్రమాలు చతు రాహ్నిక దీక్షతో సాగి 27.6.1994రాత్రి జరిగిన శ్రీ వాసవీ గ్రామోత్సవముతో ముగిసినవి.

## వివాహములు

వైశ్య బ్యాంకు జాయింట్ జనరల్ మేనేజరు శ్రీ ఇట్టా ఆంజనేయులు శ్రేష్ఠి గారి కుమారులు చి॥ రఘునందన్ గారి వివాహం, కదిరి శ్రీ నామా రామచంద్రయ్య శ్రేష్ఠి గారి కుమార్తె చి॥ మాధవితో 27.6.1994వ తేదీన కదిరిలోని ఆర్యవైశ్య వసతి మందిరములో వైభవంగా జరిగింది.

అనంతపురం జిల్లా పామిడి పుర ప్రముఖులు శ్రీ కె.వెంకట స్వామి శ్రేష్ఠి గారి కుమారులు చి॥ శ్రీనాథ్, డి.ఫార్మ్., వివాహం, బళ్ళారి వైశ్య ప్రముఖులు శ్రీ యస్. భగవత్ గుప్త గారి కుమార్తె చి॥ జ్యోతితో 30.6.1994వ తేదీన పామిడి లోని ప్రి భావసార క్షత్రియ కల్యాణ మంటపములో వైభవంగా జరిగింది.

*గమనిక :— ఈ శీర్షికన ప్రకటన కావాలనుకునేవారు వివాహ శుభలేఖతో పాటు రూ.116/-లు యం.ఓ., లేక డి.డి. ద్వారా గానీ పంపాలి.*

ఆఇఆఇఆఇఆఇఆఇఇ

తెలుగులో

# కంప్యూటర్ జాతకం

**Rs. 175/-**

మీ భవిష్యత్తును తెలుసుకోండి.

ఎటువంటి పంచాంగమును ప్రామాణికముగా తీసుకొనకుండా పూర్తిగా ప్రాచీన ఖగోళ శాస్త్ర సూత్రాల ప్రకారం, పూర్తిగా అక్షాంశ, రేఖాంశలతో కూడిన బి.వి.రామన్ అయనాంశము ప్రకారము కంప్యూటర్ చే లెక్కించి జాతక చక్రము తయారుచేసి ప్రాచీన జ్యోతిష శాస్త్రము ప్రకారము దేశములోని ప్రముఖ జ్యోతిష వేత్తలచే జాతక చక్ర ఫలితాలను చెప్పబడును.

ప్రతి పూర్తి జీవిత కాలపు రిపోర్టునందు పూర్తి వివరంగా జన్మ నక్షత్రము, జన్మ తిథి, జన్మ లగ్నము, నిత్య యోగము, పాదాలతో వివరించబడిన లగ్నజాతక చక్రము, భావము, నవాంశ చక్రములతో పూర్తి జీవిత కాల (ఇక్కడ ఆయుర్దాయమును పరిగణించటం లేదు.) దశపహారము పట్టిక, అష్ట వర్గము, నిరయణ స్ఫుటంతో సమగ్రమైన ఫలితాలతో పాటు మీ భవిష్యత్తుకు సంబంధించి విద్య, వ్యాపారము, వివాహము, మొదలగు విషయాలతో కూడిన సమగ్రమైన *18-24* పేజీల కంప్యూటర్ జాతకము కొరకు ఈ క్రింది చిరునామాకు రు.*175/-*లు మనియార్డర్ కాని, డి.డి. కాని, కె.శ్రీనివాసరాజు పేరు మీద కడపలో చెల్లు విధముగా పంపి మీ ఖచ్చితమైన భవిష్యత్తును తెల్సుకోండి.

——— మీరు పంపవలసిన వివరాలు ———

...రు, పుట్టిన తేది, సమయము, స్థలము (మండలము, జిల్లా)

రు.175/-లు డి.డి. లేక మనియార్డరు

For More Detials Send Your Enquires

**K.S.RAJU ASTROLOGY CENTRE**
Room No.4&5, Haroon Complex, Beside Ramesh Theatre,
Cuddapah.

*Computer Images.* CDP.

